సీ. చివురుఁబొట్లపుదోయి జెంచమ్ము లనఁ దార్క్ష్య
హస్తోదరములఁ దివ్యాంఘ్రు లమర,
నునుఁగప్పుమేనఁ దోఁచిన తదూర్ధ్వచ్ఛాయ
లీనఁ దాల్చు పసిండిచేల మెఱయ,
ప్రాలిక యోగివర్గము నిర్మలాంతఃక
రణములువోలె హారములు దనర,
సిరికిఁ బుట్టింటినెచ్చెలు లౌట మనవికి
డాసె మకరకుండలము లమర,

తే. శ్రిత సిత చ్ఛద వాత్యాభిహత పరాగ
వలయమండిత కల్పశాఖలొ యనంగ
శంఖచక్రాంచితోరుహస్తములు దనర,
దోఁచెఁ గమలేక్షణుండు చతుర్భుజుండు. ౧౧

క. ఎప్పుడు హరి గని రమరులు
ముప్పదియును మూఁడుకోట్లు మునిఁ గనుఁగొనునా
రప్పుడు తత్కరములతో
విప్పిన గొడుగులును మింట వేగమ మొగిడెన్. ౧౨

తే. సమ్మద దిదృక్షు ఖస్థ రక్షః పిశాచ
పుంజ మహిభు క్పతత్ప్రభంజనములు
సోఁక వెఱఁ బాఱెఁ కళ్యాన శూర్పవాత
పట్టనలఁ బాఱు పెనుఁబొల్లకట్టు వోలె. ౧౩

క. నీరంధ్రకుసుమధారా
సారచర చ్చంచరీక సంకుల కల ఝం
కారానుకారి సంస్తవ
కారి మునిస్తోమ సామగానం బెసఁగెన్. ౧౪

తే. అట్లు ప్రత్యక్ష మైనపద్మాక్షు నంత
రిక్షమునఁ గాంచి, ముని ప్రమోదాశ్రుజలము
నిగుడఁ బులకించి, కరటిఘంటికలె తాళ
ములుగ నిట్లని యమ్మహాత్ముని నుతించె. ౧౫

## విష్ణుచిత్తుఁడు శ్రీమహావిష్ణువును స్తుతించుట

### కవిరాజ విరాజితము

జయ జయ దానవదారణకారణ శార్ఙ్గరథాంగగదాసిధరా,
జయ జయ చంద్రదినేంద్రశతాయుత సాంద్రశరీరమహఃప్రసరా,
జయ జయ తామరసోదరసోదర చారుపదోజ్ఝితగాంగఝరా,
జయ జయ కేశవ కేశినిషూదన శౌరి శరజ్జలజాక్ష హరీ. ౧౬

## మత్స్యావతారము

మ. దపజద్వేషి సుదారవారిచరమూర్తిం జెంచి చాతుర్య మొ
ప్ప వడిం జొకపుఁదెల్లఁ గౌచుగమి దంభం బొంద మైఁ దాల్చి, వే
దవిశుద్ధాక్షర పంక్తిఁ గ్రమ్మఱఁగ వేఁఘం జేర్చెదో నాఁగఁ, ద
ద్భువనం బబ్ధిసితాంబుబిందు లలమం బ్రోద్యద్రుచి న్నాఁటవే. ౧౭

చ. ఎలమి యుగాంతవారి రెమ్మరెక్కలతోఁ వడిఁ దాఁటుగ హ్వారం
బుఁ జనునీటివెల్లి బడిఁ బోవు సపక్ష నగోరువాశ్చరం
బులు దనుఁ దాఁక, దద్గతత్రమోయు నజాంతమ దైత్యు వేదపం
క్తులు గొనఁ గూల్చినట్టి జయదుందుభిఁ జేసితి కాముకాంతకా. ౧౮

చ. మిత గర్వవం తిమింగిలత మెయ్మెయిఁ బెంచిన నీదు పాతఁ గు
స్తతపలలాశియైన చిఱుఁజేఁ పది ద్రెళ్ళుబ నీవు మ్రింగుటే ?
శ్రుతు లపనూరువు ల్మగుడఁ జొచ్చుతఱి న్భవదేభనైభనై
శిత జవశక్తి నీడ్చికొని తెచ్చుటకాక తదల్పతాల్పతన్ ? ౧౯

## కూర్మమూర్తి

మ. జలపూరప్లపమానమృణ్మయమహీసంరక్షకై గార యీ
బలె ముక్తామణిశుక్తిశంఖనికురంబం బెల్లఁ జూర్ణంబుగా
బలభిద్వజ్రసదృగ్జిష్ణోపరివత్ర్భామ్యన్మహామందరా
చలసంఘృష్టిపరట్టమైన కమఠస్వామి న్నినుం గొల్చెదన్. ౨౦

## వరాహమూర్తి

చ. ఒకమఱి బుద్ధగింప విలయోదకము ల్పాయి కుబ్బి, చిప్పఁ ద్రవ
చ్చుకొని, మహాత్రపీఠిఁ జన, నూకరత న్మెయి వెంచి, వెండి క్రిం

దికిఁ గయిత్రావాలు తత్సలిలనిర్మలధార నదఃపరస్ఫుర
త్ప్రకృతికి నీ యజాండమునె బంగరు ముంగఱగా నొనర్పవే?. ౨౦

## నృసింహమూర్తి

మ. అసురేంద్రాశయకాంక్షికాధ్వరుధిరవ్యాప్తస్వకచ్ఛాయఁ గాం
చి సముద్యత్ప్రతిసింహమత్సరమిళచ్చేష్టన్ దదుద్ధామదీ
ర్ఘ సటాఝాటముఁ బెల్లగించు గతి నాంత్రశ్రేణిఁ గిన్కన్ వెరం
జు నితక్రూర భవన్నఖావళులు ప్రోచు న్మర్త్యపంచాననా. ౨౧

ఉ. మునుము న్దెల్పును, దూఱనూఱ మఱి కెంపు, న్వెండియుం దూఱఁ గం
దనగాయం గలనల్పుఁ, డోఁవ నఖకోణ శ్రేణిచే విక్రమం
బున వాఁడు గతఁ గొన్నయట్టి విశసన్మూర్తి త్రయీతేజముం
గొను లీల స్వీకరింపవే యసురవక్షోభిత్తి విధ్యాహరీ ? ౨౨

## వామనమూర్తి

మ. బలివై తేయ భయాంధకారభరిత బ్రహ్మాండ గేహంబులో
వలఁ బై మండెడితత్ప్రతాపమయదీపజ్వాల డిందఁ, న్గడుం
దలమై మింటికి గ్రక్కున న్నెగయు నుద్యత్తన్మహోచ్ఛాయ నాఁ
గల నీలాంగము శింశుమార మొరయంగాఁ బెంపవే వామనా ?

## పరశురామావతారము

మ. శమిత క్షత్త్రకళత్రనేత్రజలవర్షావేశ నీకీర్తిహం
సము క్రౌంచన్నుతతావకాంబకసుషిం జాఁగంగ వీక్షించి, వ
ర్షము తా నుంచలు నంద నేఁడుఁ జప నిచ్చ న్నాటి తచ్చేష్ట వా
యమిఁ; దిర్యక్తతి దా గతామగతికం బోఁగా మురారీ హరీ. ౨౪

## శ్రీరామావతారము

మ. పవిధారాపతనంబుఁ గైకొనని యప్పౌలస్త్యుమై సప్తధా
తువులం దూఱు పరిశ్రమంబునకు నుద్యోగించె నా; సప్తసా
లవిభేదం బొనధించి నిల్వక సలీలన్ జన్న యుష్మన్మరు
జ్జవనాస్త్రం బొసఁగు న్సిరుల్ రఘుకులస్వామీ రమావల్లభా. ౨౫

సీ. స్యందనస్థితబిడౌజఃక్షత్త్రజాత్యక్ష
  జ్ఝంఝామరుద్ధరజ్ఝాత్కృతములు,
క్రవ్యాశిరాడ్గాత్రకనదసృగ్గాహన
  స్ఫుటశల్యహవ్యభుక్ఛూత్కృతములు,
యోధవర్మితహృత్స్ఫుటోత్క్రాంతనిజపాత
  సాలాశ్మకృతమహాష్ఠాత్కృతములు.
పతితోగ్రరక్షఃకబంధభారభృశార్తి
  భుగ్నభోగఫణీంద్రఫూత్కృతములు,
తే. క్రాంతరథ్యనిరంతరచ్ఛాయదములు,
  దివ్యతావకకార్ముకోత్ప్రేరితములు,
కలుషము లడంచుఁగాత లంకాపుతాంగ
  ణాంబరచలత్కలంబకదంబకములు. ౨౭

బలరామావతారము.

చ. 'క్షితి హలకృష్టిఁ బుట్టి యతఁగె క్షితియందునె సీత' యంచుఁ ద
త్పతి విరహార్తిఁ బాండిమముఁ దాలిచి రామశరీరమెత్తి; యా
క్షితిఖననక్రియ న్మగుడఁ జెందఁగఁ గాక, కళిందజాతటి
క్షితి దున నేటికి న్హలము చేఁగొని నీ కవశాత్మత న్హలీ;

కృష్ణావతారము

ఉ. ఆయతయుష్మదాకృతి కరాగ్రనగాంచలవాంత వారిధా
రాయుతచంద్రకాంతఫలకావళిబింబిత యై చెలంగ, నా
రాయణమూర్తిమత్కవచరత్నముచేఁ బరిరక్షఁ గాంచె నా
నోయదువీర, వృష్టిఁ బసి నూఱుతఁ బ్రోవవె సప్తరాత్రముల్. ౨౯

బౌద్ధావతారము

మ. తరుణత్వోత్సుతబాణపంచకమునం దైత్యాబలాశ్రేణి త
ద్వరసందోహము యుష్మదాత్మకజరద్బాణం బొకంట న్జెడన్,
ద్వరఁ గావించితి వేటికో? యహహా, బుద్ధం బయ్యె నీభావ, మ
త్తరుణీశీలతనుత్ర మేరికి నసాధ్యం బౌటఁ గా కేశవా! ౩౦

## కల్క్యవతారము

శా. ఘోరాపార మహాఘపంచకము( జక్క( ల్సేయఁగా నేర్పు నా
ధారాపంచకధావనం జెలఁగు గంధర్వంబుఁ ద్రొక్కించు బ
ల్బీరంపున్నెఱరౌతుఁ గీకటశరాశీవారవాణీభవ
ద్ధోరుద్భ్రాంతకృపాణికాద్వితయవిద్యుద్గ్రంథి నిన్ గొల్చెదన్. ౩౧

చ. అని వినుతింపఁగా హరి సుధాశనపద్ధతిఁ జూచి 'పాండ్యుఁ డి
చ్చినధన మిమ్మునీశ్వరుఁ డశేషము భాగవతాస్మదీయగే
హనివహసాత్కరించి, యకటా( కడు రిక్తత నొందు: నేతదీ
యనిలయ మప్పురి న్మణిమయంబును సార్థము( జేయు' నావుడున్. ౩౨

తే. విశ్వకర్మయు నట్ల కావించె; నంత
నంబుజాక్షుఁడు నమ్ముని నాదరించి,
యీక్షణాగోచరుం డయ్యె; ఋషియు నేఁగి
పౌరులు భజింపఁగానె పుత్తూరి కరిగె. ౩౩

## విష్ణుచిత్తుని స్వపురప్రవేశము

క. స్థానికులు దన్మణి దివ్య
జ్ఞానందితు లగుచుఁ బురము గై సేసి. ప్రజ
తోనడువ నాగవాసము
తో నెదురుగ నేఁగి; రంత తూర్యము లులియన్. ౩౪

వ. ఇ ట్లెదుర్కొని పట్టపవిత్ర భగవత్ప్రసాదతీర్థంబు లుపాయనంబులుగా( బ్రణామంబు లాచరించి లేచి, ప్రాంజలులై, ధర్మపరికర్మవర్మితం బగు బ్రహ్మరథంబున నబ్భాగవతపతంసంబు నునుచుకొని పోవుసమయంబున(, ఖరస్వరసమేతంబు లగు పౌరజానపదజనంబులు గలసి మెలసి నడచునెడ: మృదంగం బుపాంగం బావజంబు డండె తాళం బురుమ కిన్నెర సన్నగాళె వీణె మఖవీణె వాసెగ్గోలు డోలు మౌరి భేరి గౌరు గుమ్మెట తమ్మెటంబు డుక్క ఢక్కి చక్కి చుయ్యంకి కోనగు ననంఖ్యాతవాదిత్రత్రితయవరంపరలు మొరయ; నెడనెడఁ బరఁతుకల మలఁపుగొనఁ బట్టణాగతగజఘట్టఘోట్టణఘోటక ఘంటాకదంబఘర్ఘర ఘోషంబుల కనుప్రాసనంబులై, విలాసినీ మంజు మంజీరంబు లెలుఁగయ్య నల్లనల్లనం జాఁగి తఱిఁ; గెలంకులఁ

గపచితకుథాకర్పూర లగ్న కదళిపరిదిరేఖా కంధరలం గనకాంచుకశకలంబులు కేలం బూని సేవించి పోవు సామంతభూకాంతకుమారభట్టంబులం బిట్టు గాంచి, యొండొరులం గడవ సంభ్రమించుచు, మ్రొక్కినిక్కి చేయెత్తి యుత్తిలి నేత్రంబు లుత్తానతరళతారకంబులుగా మగిడి మగిడి పొగడుచుం బోవుతఱి; దద్రాజకదంబకం బచ్చోటిపదంతుకులకుం దమకుం బురికిం జనుదెంచునప్పు డెల్ల నెదకాం ద్రొక్కట మేలమాడంబోలు నాప్రోలిమేళంపుం గళావతుల వైచు కపంబునం గ్రామగ్రామగ్రామణుల లోనంగు నారంగ మాతులుంగ జంబీర కుంద కందుకాదులం బూర్వానుభుక్త లగునక్తంకరముఖుల వైవ: ధళధళ త్తరళతాటంకంబును నంకురితవిస్మయంబునుగా, నాతన్ముఖప్రేంఖోళితస్మిత సాకూతవిభ్రమాకేకరాపాంగ విలోకనంబును నాచలితధమ్మిల్లంబునుంగా, మొగంబులు తిప్పికొని సమ్మర్దంబునం జనుమార్దంగికుల మూఁపుల మఱుంగులం డాఁగి, యన్నాగవాసంబులు నాగరకవిలోకనంబునం జెలరేఁగి, మొగంబులు ఓగించికొని, వేదు రెత్తినగతి నరిదియెత్తఁ బ్రతిపదంబును మర్దల ముఖాపమర్దనకుం గ్రంగిపోయి, బయటం బడి చేయునది లేక యాకడకు మగిడి తుఱుము దిద్దుచుం దద్వారణాభినయపత్వరాగీనకరాబ్జలై సుడివడునెడం బొడము కర్ణపసుమాపతనసకిపోంఖురళీకించిచ్చలనోపలక్ష్య వైలక్ష్యహాస కుందంబులు సాంద్రతరచంద్రికాకందంబులం దీటుకొలుపం; జాటూక్తివాచాజ లగుజరఠవనితలు తమకు మ్రొక్కం దాను మ్రొక్క కొక్కించుక యోర మోమిడి, వారియిరుపక్కియల నొదిఁగి తొంటియట్టుం దలంచి తలవాంచిన, వంచనం గటాక్షించి యెక్కసక్కెంబునకుం దమచేత మ్రొక్కించుకొనువేక్క నక్కడం బుడమితేడు లేమి సామాన్యమానవులం గైకొనక. సుమాళంబు వేద్యంబుగా విద్యావయోవృద్ధుల రగమీరు మ్రొక్కంగా దారు మ్రొక్కమి యెట్లు మ్రొక్కింపుం డనుటయు; గ్రక్కునం బొడము మొలకనగవుల మోవుం దమ్ములకు వే జొక్కవింత తెలివి యెక్క, మ్రొక్క కక్కడం గెడఁగూడి నడచు తోడి చేడియల కద్దొరలకుం దమకుం దగ్గయుం బొందు గల దను పెద్దతికం బెఱుకపఱుపం గెమ్మోవులు మలంచి లోలోన నొయ్యనొయ్యన నుచుక్కవ నక్కిలెత్తింగి దక్కె సొమ్మని తమ్ము నమ్ముదుసళ్ళు ముందఱిక నూకి 'యక్కక్క, మ్రొక్కవే మనపాలివేలు' వని బుజ్జగించియు బొమలుగొని జంకించియు నెట్టకేలకు నొడంబఱిచినం; ద్రపాతరళనయనలై విరళవిరళాంగు

కాంజలి బంధంబుగా మ్రొక్కి, కక్కసెన నిట్లు మ్రొక్కంగి, హెచ్చి, యచ్చ య్యాట మేడపడకయుండంగా జిగురుగండెల వోలె నల్లికొని గొల్లన నగు నల్లోలాంగనలఁ గల్లకోపంబునఁ గొట్టి కసరుఁజూపు నా రాజసంఘంబుమీఁద నిగుడ, మగండ మలుపడు. కొమిరెహరిణలోచనల చలితకంకణసంకులక్రేంకారంబు లాలనామోద మేదురాళిఝుంకారంబుల బింకంబు లడంప; జెవులనంకులు లోవంక భుజంబులు కొంకిసిగలు గావిదువ్వటులు నొప్ప. నిమ్మ దెప్పరంబై మువ్వన నప్పురంబుఁ జేరి, రసికజనబాంధవంబున బంధువియోగంబుమఱచి. గంథకలహాకుసుమ గ్రగ్గథ వాదులనాంధ్యంబు లే కలయు నంధ్రదేశీయు లగు గంథకారులు పాటిపాటి పద్యంపు మొక్కులతో వెట్టివెట్టి కై వారంబులు గౌరిత త్తడులపై వచ్చు రాచవారిపై నాఁడువారిపై నాటువారిపైఁ జల్లగాఁ జల్లఁ, బెల్లగని సృష్టియెల్లను ముష్టి కరించుచు. నస్పష్ట భేదయగుపరిమళసమష్టం బెట్టు విష్ణాతకంబు నబోమంతలికం జండాతకంబై చంతగొరకిరణంబుల మాటు పఱుపఁ, బన్నీరు నించిన తన్నీరుతిత్తులొత్త; వియత్తలంబునం బాటి కై వాలు ధావల వాహ్యంబులు దడిసిన విద్యోపజీవులు పుష్కరంబులు గ్రాప నగ్గిరోయుచుండ: నమ్మొత్త మత్తణీ స్మృత్తంబుఁ జూచ నిలిచి మెత్తమెత్తన నకచుచుండు మిండతంతంబునుం దారు నప్పిండు పుండరికాస్య లవకాశంబు గాంచి క్రాళకుసుమ ప్రవతిఫలనపాండురంబులై పద్యాతి హృద్యపార్శ్వ ద్విట్యోద్యాన పాదపంబులకుంబాలు చెంగలువకాలువలకుం డిగ్గి క్రానరీదధిమండ. మానరంబులుగాఁ బిసికి యూరంబెట్టిన నారంగశృంగబేరభంగంబులతోఁ గట్టిన కలమాన్నంపుఁజలిది పోకపొత్తులం గుడువఁ గూర్చుండ వీక్షించి; కుక్షింభరిత్వంబున క్షుత్క్షాములై తిరిగితిరిగి వేసరి యోసకిలిన దాసరిగుంపు వారి పాల గోపాలభిక్ష భిక్షించి భక్షింపఁ దీరక్షోణుల నిలిపినతోరంపు దివెదారికోలల రంధ్రగోళంబుల నుత్కీలంబులై మంచు ధగధగని జగజ్జ్యోతిదీపజాలంబుల మధ్య ధూపకుండికాంగారంబుల పిరాలఁ గ్రాంచి, నాదుఁ బరికింప వాయించు ధిమిధిమిధ్వానంబులకుం బెదరి యీవలియుపవనశుకంబు లావలికావలి యుపవన శుకంబు లీవలికి దట్టంబుగాఁ గట్టనితోరణంబులై పఱవఁ, దలలు విసరుటయు నోరు దెఱచుటయుఁ గేలు సఱచుటయుఁ దక్క మిక్కుటం బగు నక్కోలాహలంబున నేపాటియుం బాట వినరాక మూకగట్టిన భాగవతజాతంబు లేతేర; నూరూరినంతనంతకుం దిశగఁ బెద్ద లింటింటసంతరించిన పిలుకువాటుగోడ

గల జాపడంబులకుఁ బుట్టి కల్గట్టి పిడవ నెత్తంబున మెత్తని గట్టిక మేసి పోసరించి మాపుమాపున మేపుసజ్జకవణంపు మేపునఁ బిడుక గొఱవంబు తోమ కంబునఁ బుటపుటనై క్షత్రియకంబడి ప్రాఁకఁ గసిమైన సీతం గనిమైనం బెదరు కొదమ తట్టువగంవు కాలికొలందికి ప్రేలు లాలుకుంచెలు గీలించినగవ్వదండల గండల నలంకరించి, మోలుగ మడ్డిం దోఁచి మూర కొక్కండునుజేనకొక్కండు నుగాఁ గట్టినడొల్లు టుల్లారు లుల్లసిల్లంబల్లించిన పల్లంబులపైఁ జిల్లతెలం బును వాసనకొడుపులం బూనినమఱుంగుఁ జంద్రికచేలలె రవణంబులుగా నెదురుగా వేడుకం జూడవచ్చిన యప్పీటి మేటిసాలె యగసాలె పటుసాలె వానెవై జాతి సాఁతు లేతులకొమరులు తుములమై వచ్చు తుచ్ఛమూసామజం బులం జూచి యేఁచినవెఱం దమయెక్కిరింత లెక్కకొని వాగె లిరుగేలం గుదియంబట్టిన నిలువ కయ్యుత్సవం బీక్షింపవచ్చిన ప్రజలం ద్రొక్కుచుం బోవఁ; దన్మత్యవృద్ధవధ్వాతురాదులు దిట్ట నిట్టట్టనలేక ప్రాణంబులు విడి కిటం బట్టుకొని పోవుచు. నవీననవిధకేదారంబులం ద్రెళ్ళి చట్టలు ధిగంబడి వెడలలేకుండం దారు దిగ నిమ్ము లేక పిమ్మటఁగొని నలుదెసలం జూడం, జూచి కేలు నలచి కోహో యని గేలిసేయు గణికాకదంబంబుల చప్పటులు నిబిడ నిష్కుటవిటపిఘాటంబులం బ్రతిశబ్దంబులు పుట్టింప; నిట్లనూనవిభవంబు దిగు రొత్త నత్తిరుపతి సొచ్చి యచ్చక్రధరునగరిమోసల నిలుచుటయు, నవ్విష్ణు చిత్తుండు దద్రథావతరణంబు చేసి, ధరణీధవస్థానికసమూహంబు వెంటరా నవ్వైకుంఠు సేవించి, తత్ప్రసాదలబ్ధం బగు పరివట్టంబున నలంకృతుం డై, నానాలంకారసహితబును రత్నకాంచనమయంబులు నగు నాత్మీయభవనంబుం గాంచి విస్మితుండై పుండరీకాక్షమహిమాభిలబ్ధవైభవంబుగాఁ దెలిసి తత్రత్య ధాత్రీకళత్రవర్గంబుల ననిపి ప్రవేశించి, తొంటికంటె శతగుణంబుగా భాగవత పూజాప్రవణుండై యుండె నంత. ౩౧

మ. ఉలుపాల్పట్టినయిండ్ల మజ్జన నృపాహార్యోదారభుక్తిక్రియో
జ్జ్వలులై, రే హరికొల్వునన్ వివిధలాస్యస్పర్ధి సుభ్రూభ్రుకుం
సులవాదు ల్పరిదేర్చి పుచ్చి, మణివాసోభూషణగ్రామమున్
జలజాతాక్షునకున్ సమర్పణము నిష్ఠం జేసి, యువ్వేకువన్. ౩౨

తే. ప్రభువు లరిగిరి క్రమ్మఱఁ బాండ్యనగరి,
కమ్మునియు నట్టు వైష్ణవాభ్యర్చనంబుఁ

దన చిరంతన తులసికాదామకరణ
దాస్యమును జేసికొనుచుఁ దత్పరత నుండె. ౩౭

వ. ఒక్కనాఁడు మధ్యాహ్నసమయ మాలికా సమారోపణానంతరంబున మందిరంబునకుఁ బోవునతనికి బ్రసాదమందస్మిత సుందరవదనుండై యగుకటాక్షంబున వీక్షించి పక్షిపుంగవకేతనుండు పుండరీకనికేతన కిట్లనియె. ౩౮

## యామునాచార్య చరిత్రము

తే. 'యామునాచార్యుఁ డొక్కఁడు నీమహాత్ముఁ
డొక్కఁడును గాదె దర్శనం బుద్ధరించి
రస్మదీయకృపాతిశయమున,' ననిన
నిందిరాదేవి తన భర్త కిట్టు లనియె. ౩౯

క. 'ఇతనికథ యెఱిఁగినదె కా,
యతఁడేమి యొనర్చె?' ననిన నబ్జాక్షుం డా
శతపత్త్రనిలయ కిట్లను,
'నలినాక్షి! కలఁ డొకఁడు మత్పదాశ్రితుఁ డాదిన్. ౪౦

ఆ. అతఁడు చిఱుతనాఁడె యాచార్యకులమున
వేదశాస్త్రముఖ్యవిద్య లభ్య
సించుచుండ నపుడు చెలువ. యిప్పటి పాండ్య
నృపతి పూర్వవంశ్యుఁడే యొకండు. ౪౧

తే. వెఱ్ఱిశైవంబు ముదిరి మద్వినుతి వినఁడు,
నతి యొనర్పఁడు మామక ప్రతిమలకును.
హరుఁడె పరతత్త్వ మను, మదీయాలయముల
నుత్సవంబుల కులుకు, నెయ్యురును నట్లు. ౪౨

సీ. అశ్రాంత జంగమార్చాసక్తి వర్తిలు
వేదవిద్ద్విజపూజ పేటఁ గలిపి;
భౌమవారవు వీరభద్ర పళ్ళెర మిడు
గృహదైవతంబు లిట్టింకు లింక:
షణ్ణవతిశ్రాద్ధచయ మారఁ బెట్టు సం
కరదాస మయ్యె భక్తప్రపత్తికి;

నాదట్టంబు లైన దేవాలయంబులు వ్రాల
నవని నిరాళ మఠాళి నిలుపుఁ;

తే. జందె ముత్తరశైవంబుఁ జెంది త్రెంచుఁ;
బతితు లారాధ్య దేవళ్ళ ప్రాప్య మనుచు
సుపనిషత్తులు వారిచే నుబ్బి వినుచు,
వెండి యే జంగ మెత్తిన వెరఁగుపడును. ౪౩

క. శివలింగముఁ దాల్చిన జన
నివహం బేమైనఁ జేయనిది పాపము దా
నవుఁ గా దనఁ; డా సమయము
నవు నను విప్రులకి యగ్రహారము లిచ్చున్. ౪౪

తే. అతఁడు రాజ్యంబుఁ బాలించు నవసరమునఁ
దనవశం బైనయట్టియత్రాసువర్తిఁ
గలుగు నలవుట్టరాని ముక్తామణికు
లంబు మాహేశ్వరుల కంధలకునె తీఱె. ౪౫

తే. అప్పు డిచ్ఛకులగుచు బ్రాహ్మణులు కొంద
ఱాత్మజనిభూమి విడువలే కలికభూతి
గర్హముల నాస రుదురాక లిద్దసంధి
నూతసంహిత లిఖికించి బోరఁ దొడఁగిరి. ౪౬

క. శీలముఁ బట్టియు గంజా
హాల లుపాంశున భుజింపనపముల బైఁ టం
జాలఁడు వైవన్, విప్ర
స్థాలిత్యము బైలుసేసి కనుగొనవు సభన్. ౪౭

క. ఆరాజుమహిషి యేని వ
దారాధనపరత సుందరి; సట్లుండియును దు
ర్వారవ్యథఁ గాంచదు
పౌరసభ, విభుఁ డన్యదంభ్రిభక్తుఁడు గామిన్. ౪౮

వ. మఱియు నప్పురంధ్రీరత్నంబు. ౪౯

సీ. వింగడం బైనట్టి ముంగిట నెలకొన్న
బృందావనికి ముగ్గు వెట్టఁ దాన:
దశమినాఁ డేకభుక్తము సేసి, యవలినాఁ
డోర్చి జాగరముతో నుండు నిట్లు;
బారసి పోనీదు, వైనిద్రఁ బాయుట
క్కాలుపాడు మత్పుణ్యకథలఁ ద్రోయు:
నేమంపుమూనాళ్ళు కామింప దధినాథు:
మఱునాఁడు కన్నును మనసుఁ దనియ
తే. నారజపువన్నెఁ బ్రియుసెజ్జ కరుగుఁ గూర్మి;
నరుగుచో నాభిఁ దుడిచి కప్పురపు నాభిఁ
బెట్టు; నిట్టుల మద్భక్తి పుట్టియును ని
జేశునెడ భక్తి చెడదు మదిష్ట మగుట. ౩౦

క. వనజజ రుద్రాదులు మ
త్తనువులె; తత్పూజనంబు తథ్యము మత్పూ
జనమె; తదీప్సిత ఫల దా
తను నేనె; యట్లైనఁ గలవు తరతమ వృత్తుల్. ౩౧

క. కేవలశరీరదృష్టిన
దేవతల న్వేఱ కలుగఁ దెలిసినజడులౌ
నా వాసుదేవతాస్థితి
భావింపని పూజ సాంతఫలమై త్రివ్వౌ. ౩౨

వ. మఱియు నీరహస్యంబుఁ దెలియ కబ్భూపతి తామసుండై. మామకీనంబులగు జనంబుల సామాన్యబుద్ధిం జూచుచుఁ దద్వృత్తుల కగునుపద్రవంబుల నుపేక్షించుచు, రక్షావిముఖుండై యుండ వీక్షించి; కలియుగంబున ద్రవిడ మండలంబునఁ గృతమాలా తామ్రపర్ణీతటంబుల మద్భక్తులు తఱచగుటను, దద్దేశంబున కౌరయం దతండగుటను, రక్షణశిక్షణంబులు రాజముఖంబునం గాక నేన సాక్షాత్కరించి చేయమియుఁ, దద్రక్షణేచ్ఛ యస్మదాభిముఖ్యంబునం గాక పొడమమియు, నాయాభిముఖ్యంబు సంవాదంబునం గాని పుట్టమియు, నే విచారించి; తదాభిముఖ్య కరణార్థంబుగ నాస్థానంబెక్కి వాదిజయంబు

సేయఁజాలయు నన. తలం పవ్విప్రకుమారునకుం బుట్టింప; నతం డేఁగి నానా దేశాగతదీనానాథవృద్ధభూసురకుటుంబంబులకు ధాన్యాజినపటాదులు, వటువులకుం బెండ్లిండ్లు, కనుపనీతుల కుపనయనంబులకుఁ, బంగ్వంధబధిరాదులకు సౌరభేయాదియానంబులు: వృత్తియుఁ జెఱువు గడమపడియె ననియు; బేసగుడులకుఁ బూజ నడవ దనియు, నెడవుసం జలివంది రిడియెద మనియుఁ, దిథి చిక్కె ననియుఁ, దీర్థయాత్రఁ జనియెద మనియును; వ్రతోద్యాపన కనియును, వ్యాధి మన్నుకో ననియును, జెప్పి పంప, నారాణివాసంబు గప్పాగు పత్త్రప్రకారంబులం బంపుద్రవ్యంబుఁ దెచ్చి యిచ్చు ముదుసళ్ళగువర్షధరులచేతులకుం గ్రందుకొని చే సాఁచిన సందిటితోరణంబులై తోఁచు నేకదండి త్రిదండి బ్రహ్మచారుల యున్నమితదండంబుల నిండారు కాషాయకద్రుపవస్త్ర కౌపీన పరంపరలం గ్రమ్ము కావళ్ళపడగలజాడఁగొని, కార్పణ్యంబ విద్యగాఁ దక్కనవిద్య లెఱుంగక వేఁడు నీదృగ్విధానేకప్రాణుల కాధారంబగు పడమటిద్వారంబుఁ జేరి. ప్రతిదినాస్మత్పాదరక్షణ కథాశ్రుతపూర్వ యగు నాయుర్వీధవుదేవి కాశీర్వచనాక్షతంబులు దౌవారికముఖంబునం బంపి: 'వైదేశికుండ వైష్ణవ వటుండ, వాది గలిగిన విష్ణుతత్త్వంబె పరతత్త్వం బని వాదించి గెలిచెద, వసుధావరుండు విష్ణుభక్తి విముఖుండు, గావున వైష్ణవునిమనవి విన్నవింప నెవ్వారు వెఱతురు: నీవుభక్తిపరాయణవు, పతిహితాచారవుం గావున నీకు విన్నవించి పంపితి: నీవిభుఁడు నీకు విధేయుండు, విన్నవించి నన్ను రప్పించి వాదంబు సేయింప నోపుదేని వాదించి గెల్చి, నీదుభర్తకు భగవద్భక్తి బుట్టించి కృతార్థుం గావించెద' నని విన్నవింపం బంచిన. ౭౩

తే. గ్రీష్మసమయనిరుత్సాహకేకిరమణి
నవఘనధ్వని కలరుచందమున నలరి,
యేకతమ నర్మగోష్ఠిఁ బ్రాణేశుకోడ
నతని, విథ మెఱిఁగింప, నిట్టట్టు పడుచు. ౭౪

క. భూవల్లభుఁ 'డెట్టెట్టూ!
తా వాదము సేసి శివమతంబు జయింపం
గా వచ్చెనా? చూతముగా,
రావింపుఁ మటన్న నాఁటిరాత్రి చనంగన్ ౭౫

వ. ప్రభాతంబునం బరిమితజనంబగు నాస్థానంబునం గొలువున్న భర్త్రమోలిం
దానుండి యయ్యుంమనదన యతనియనుమతిం బ్రతిహారిచేతఁ బిలువఁబంచిన,
నబ్బానిలింపకుమారుండు. ౫౬

## యామునాచార్యుఁడు పాండ్యసభం జేరుట

క. ద్వారంబు సొచ్చి, కీలిత
గారుడమహా వజ్రవేదికం జివురులఁ గెం
పారు నొకవిప్పలముఁ గని,
యా రావి న్వాదసాక్షికై వలగొనుచున్. ౫౭

సీ. పసిడిఁగ చ్చమర సోపానముల్ మూఁటఁ దుం
గిత విశాలితయుఁ జిత్రితయు నైన
సభ మహాకుథముపై శార్దూలచర్మఖం
డావృతుల్ జటిలులు నైన జరఠ
మాహేశ్వరులు చుట్టురా, హారనంధి రు
ద్రాక్షాయుతముఁ దాల్చి యశికభూతి
సురటిగాడ్పుల రాల, నరుణాయతాక్షుఁడై
కుఱుగద్దె బిల్లఁ బ్రకోష్ఠ మునిచి,
నంది ముద్రితపాణియందుఁ జెక్కుఁ జేర్చి యా
గమములు వినుచు, హేమము పొదివిన

తే. యంజలి రుద్రాక్షగమి కుట్టుఱంపు మెఱయ,
వెలితపారంబు మించ దువ్వలువ గప్పి,
యడపమును వాఁడివా లొక్కయతివ దాల్ప.
భార్య వింజామ రిడ, నొప్పుపాండ్యుఁ గనియె. ౫౮

వ. కని వినీతుండై చేర నరిగి యజ్ఞోపవీతంబు గాను కిచ్చి కూర్చున్న నాదరిం
పక నంరంభియై య వ్విశ్వంభరాభర్త యిట్లనియె. ౫౯

తే. 'సంగతియె యోయి, యినుమంత లింగ బాపు,
తత్త్వనిర్ణయవాదంబు దరమె నీకు !
నోడతేనియుఁ బట్టి, మొట్టో యనంగ
లింగమును గట్ట కుడుగ, మెఱింగి నొడువు. ౬౦

తే. వాదుల మఱంచుఁ జెప్పించి వత్తు; రోఁట
మైన దయ సీరె యేమైన నని విలజ్జ
జూటుఁదనమున నట లెక్కఁ జొరవకాంద్రుఁ;
పాఱువారలసుద్ది సెప్పంగ నేల ? ౬౧

వ. అని పలికి దరహాసంబుతో దేవదేవుఁ జూచి యి ట్లనియె. ౬౨

క. 'అన్మన్మతస్థుఁ డోడిన
భస్మము రుద్రాక్షములును బాసి యితనిచే
విస్మయముగ సాత్త్వము మఱ
ఘస్మరచక్రాంకితుండఁ గాఁ గలవాఁడ౯. ౬౩

తే. ఉపిద, యీసిద్ధువిద్వాంసుఁ డోఁడెనేని
నీకు నితని కే నన్నపూనికయ' యన్న,
'నొప్పితిమి దేవ రానతి దప్పకున్నఁ
జాలు మఱి పంచభూతము ల్సాక్షిగాఁగ. ౬౪

వ. అని పలుకు నయ్యురుపుర ప్రతిజ్ఞ లాకర్ణించి. ౬౫

తే. అతఁడు మృగకృత్తి పెళపెళ యనఁగ, బసుపు
గోచి కట్టిన మోదుగుఁగోల నెగయఁ,
బ్రాంజలి వినీతుఁడై విన్నపం బఱంచు
నర్థము కాననత నిట్టు లనియె ధృతిని. ౬౬

క. 'దేవా, యిట్లని యానతి
యీ వల, దేఁ గఱుపుఁగూటి కిటు రా, నాకుం
బేవారిఁ బ్రోవ ? భిక్షా
జీవిక వర్ణికిని విధి సృజించెనె గాదే ? ౬౭

తే. ఎవ్వఁడే సర్వభూతస్థుఁ డి త్తెఱంగు
వకును బ్రేరేఁచె, నతనియానతియె తెచ్చె,
నెఱిఁగినవి నాల్గు నొడువ నేమఱున లెన్స:
యతఁడ కొంకిన నేమిసేయంగ వచ్చు ? ౬౮

తే. పంతమైనను గానిమ్ము పార్థివేంద్ర,
యుక్తులను నిగ్రహస్థాన మొదవెనేని,

యమ్మ దెచ్చినవిద్వాంసుఁ దనఁగ వలప,
దెట్టు గావింప వలయు నట్టట్లు చేయు. ౧౯

వ. అని యులుకు విడిచి పలికి, మగుడం గూర్చుండి, యతని యనుమతి వాదం
బునకుం దొడంగి. ౨౦

## అన్యమత ఖండనము

సీ. అందులో నొక మేటి కవిముఖుండై యాతఁ
డనిన వన్నియును ము న్ననువదించి;
తొడఁగి యన్నిటి కన్ని దూషణంబులు వేగ
పటక తత్సభ యొకఁబడఁగఁ బల్కి;
ప్రక్కమాటల నెన్న కొక్కొక్కమాటనె
నిగ్రహస్థాన మనుగ్రహించి;
క్రందుగా రేఁగినఁ గలఁగ కందఱఁ దీర్చి
నిలిపి; యమ్మొదలివానికినె మగిడి;

తే. మఱి శ్రుతిస్మృతిసూత్రసమాజమునకు
నైకకంఠ్యంబు గల్పించి, యాత్మమతము
జగమెఱుంగఁగ రాద్ధాంతముగ నొనర్చి;
విజితుఁ గావించి దయ వాని విడిచిపెట్టె. ౨౧

క. 'నీ వేమంటివి రమ్మం'
చావలివానికిని మగిడి యట్లనె వానిం
గావించి, యొకఁడొకఁడు రా
నావిప్రుఁడు వాదసరణి నందఱఁ గెలిచెన్. ౨౨

వ. ఇట్లు జయించి విష్ణుదేవుండె పరతత్త్వం బనియు విశిష్టాద్వైతంబ మతంబు
నగుటయుం బ్రతిష్ఠించిన. ౨౩

క. ఆయెతను నొక్కపలు కెదు
రై యుండెడు పిప్పలమున నాయెను విన, 'నో
హో, యిది నిక్కము, సృప, నా
రాయణుఁడె పరంబు. కొల్వుమతని' నటంచున్ ౨౪

వ. అప్పలుకులు విని ఖిన్నుండై యక్కూటదీనపాషండషండంబు దలవంచుకొని పోయిన, నాయుర్వీధవుం డతని మాహాత్మ్యంబునకు సంతోషించి సాష్టాంగ మెఱఁగి, హర్షామృతరసోత్తరంగితాంతరంగుండై, భుజగశయనచరణకుశేశయభక్తి వొదవి కృతార్థతం బొంది, పాండ్యమండలమునకు భాగినేయుండు పట్టార్హుండు గావునఁ బాత్రంబని బ్రహ్మచారి యగునతనికిఁ దన కడగొట్టు చెలియలిం బరిణయంబు సేసి, యరణంబుగ నమ్మహాత్మునకు ధారాపూర్వకంబుగా నర్ధరాజ్యం బిచ్చి, యువరాజుం జేసి, యధీతసాంగవేదుండగు నతనికి నథర్వశిరస్సభ్యస్తం బని యెఱింగి, యందు దివ్యాస్త్రమంత్రంబుల కలిమియుం దెలిసి, యమ్మహాత్మున కెచ్చరించి దుస్సాధం బగువిరోధియూథంబు సాధింపుమని దండయాత్రం బనిచిన, నయ్యామునుండును సన్నద్ధుం డగుతఱిఁ దత్పురోహిత ప్రధానమంత్రివర్గంబు సన్నిహితంబులగు నివ్వార్షిక దినంబులు గడపి శరత్సమయంబున విద్వేషత్సంహారంబునకు విజయంబు సేయు మనుచు, నత్తెఱంగు రాజున కెఱింగించి తత్సమ్మతంబున నిలిచె నంత. ౨౮

## వర్షాకాల వర్ణనము

ఉ. కర్కశుఁ డంప కోర్వ, కువకంబులు వాఃపతి గూర్చినట్లు న
య్యర్కుఁడుఁ దాఁచుఁ గూర్చె. మఱి యాసలిలాధిపచిహ్న వాహతం
బేర్కొని గంగ నాతఁ డెలమి న్మకరస్థితిఁ గన్ననీర్ష్య, దాఁ
కర్కటకస్థుఁ డయ్యెనన, గర్కటకస్థితిఁ గాంచె నత్తఱిన్. ౨౯

తే. వనతతి వరాహ వాహారి వాయుభుగ్వి
రోధి వారణ వర్షాభు లాఁచిఁ దొఱఁగె
నెంద్రి రవి చేర; మూఁడవ యెడకుఁ జేరు
ధరణి ధరణిం బ్రమోదసంధాయి గాదె? ౩౦

తే. వనధిగమనజగర్భార్కజనితమృణులు
మఱి ప్రసూతికి నతసిధామంబుఁ జేరె;
ఘనతఁ జొచ్చెనయిండ్లను దనుజ లుండ
కాన్పునకుఁ బుట్టినిల్చేరుక్రమము గనమె ? ౩౧

తే. ఉర్విఁ గాదంబినుల యలయుమ్మ నీరు
దొరుఁగఁ గేకులు కేకలు తోన నేసె,
ద్విజకరారణ్యకధ్వని వినఁగఁ జేసి
గర్భము సుఖమ్మృతము సేయఁ గడఁగె నెనఁగ. ౭౯

మ. అంపర్జన్యుఁడు బాహఁ దన్కొలిమిలో నభ్రంపుఁ బెన్గొప్పెరన్
జల మూఁగన్ బిడుగుక్కుజాత్యపుటయస్కాంతంపు నత్తున్కలో
పలఁ జూప, న్మహిమీఁదిలోహరజముల్ పైఁ బర్వె నా, లేచె వా
త్యలఁ బ్రాగ్దావమషుల్ మ్రగి ల్మ్రదల గ్రద్దంతై దివిన్ లేచినన్. ౮౦

తే. ఇలకు డిగి, చుట్టిముట్టి దుమ్మెత్తి, యెగసి,
పోయి, తము ముంచుసుడిగాలిపుష్కరములఁ
గడలినీ రభ్రకుంభము ల్గ్రాగె, ధరణి
నభ్రకరిశిష దివిఁ గాంచిపట్టికథణి. ౮౦

తే. కృతపయఃపాననవమేఘపృథుకములకు
రాలె నొయ్యన వడగండ్లపాలపండ్లు;
మఱి బలాకాద్విజాళిసంప్రాప్తి గలిగెఁ,
బెరుఁగఁ బెరుఁగంగ ధ్వనియు గంభీర మయ్యె. ౮౨

మ. తనతోయం బినరశ్ము లెత్త, నిల వాత్యారేణుమూర్తి న్మహేం
ద్రునకుం జెప్పఁగ, ముచ్చుఁ బట్టి దివమందు న్విల్లుటింపం, భయం
బునఁ దద్రశ్మిసహస్రము న్వెస డిగెం బో డాఁగి వే గ్రుమ్మరిం
వ, ననం ధారలు దోఁచె మించు వెలిఁగింప న్మబ్బుల న్వెల్లిపై. ౮౩

చ. తొలితొలి పచ్చధారల నెదుర్కొని, తచ్చటఁ దీఁగచుట్టుగా
నలముచు, ధాత్రి లేచి, పొలుపారె మలీమసబాష్పవల్లు; ల
త్తొలితొలిధారకే వెఱచి; తోన ఘనౌఘము వానకాళ్ళకుం
బలరిపుఁ డాలయాభ్రముల భంగినె సంకెల లూన్చెనో యనన్. ౮౪

చ. ఎడపక మున్ను మింటిపయి నేతగులంబును లేక మూకతన్
వెడలెడుచోఁ గఠోరఘనబృందము లడ్డము వడ్డ, వానిమే
యిడియ జవోష్మఁ బొఱెడు రవీందులదట్టపుబండికండ్ల చ
పళుడుగతి, మ్రోసె రేవగలు భూరిభయంకరగర్జ లత్తఱిన్. ౮౫

చ. దినములపంబుడిం జడనిధి న్మును గ్రోలిననీరిలోనఁ జే
రినలవణంపుఘట్టముల దృష్ట్యదిరమ్మ దదావము ల్దవు
ల్కొని పెటిలించునార్పటు లొకో, యన నౌ సతటిద్భయంకర
స్తనితములన్ సృజించె నతిసాంద్రఘనాఘనగర్భగోళముల్. ౮౬

మ. ఇనరశ్మి ల్తృష వార్ధిఁ జేరి జల మొక్కింతం తాన; నాత్మోష్మఁ జు
య్యని వెంటం బొగ ముంచికో నెగసి, వాతాధూతతత్స్కంధులం
గన నౌచుం. గళద్రశ్మిలై వతకురేఖం దిక్తటప్రోత్థిత
స్తనయిత్నుచ్ఛటఁ జంచల ల్మెఱసె నాసారంబు దోరంబుగన్. ౮౭

మ. ఇల సుంగల్గినజీవనంబుల నిజానిష్టోగ్రమార్తండమం
డల మాసం, దయ వైరివైరి సఖుఁ డౌటం ద్రవిం బీల్చి, య
య్యిల కొసఁగ్గమ్మడిఁ గుమ్మరింపఁ దగుఁ దా నెంతైన, నంతైన మం
డలముల్ రాహు వొసంగఁ దాల్చగతి మింటం బర్వెఁ గాలాభ్రముల్, ౮౮

క. పుట్ట పదలి నభోభిత్తిఁ బట్టు శక్ర
కార్ముకవ్యఁ బెద్ద పలువన్నెకట్లజెట్టి
పైన సపచెడి కాళ్ళగుం పనఁగ గాలి
గార్కొని దిగంతముల వానకాళ్లు నడచె. ౮౯

చ. ఒకపినుకు న్పసన్య యపు నుర్వికి డిగ్గఁగ నీవు మూఁగి చా
తకము, లపుంచుఁ లోఁ గనలి దట్టముగా నలమేఘుఁ డాడు చుం
డక చన నూఁదఁగాఁ దొరఁగు నాళపుటుండలు వోలె రాలెఁ ద
క్కక పడువర్షధారల ముఖస్థములై కరకానికాయముల్. ౯౦

సీ. ఎలగోలుజల్లు ము న్నెళపెళ నేటవా
ల్పడి గాలి నట్టిండ్లఁ దడిపి చనఁగ;
నట్టె తో వడగండ్ల కట్టావులు దుమార
మావుల రేఁచి రెండవదియుఁ జన;
మఱి మూఁడపది నిల్చి మెఱసి బిట్టుఱిమి
కరవారి సృష్టిఁ జీకటిగ నలమ;
నుయ్యాలచేరుల యోజఁ బైపై వెండి
జల్లుసైజల్లు పెల్లల్లుకొనఁగ;

తే. భూభిదాపాది మర్త్యరాంభోభరంపు
వడి మహోజ్ఝంఝఁ దెరలక కడవ వంచి
నట్లు హోరని దారౌఘ మైక్య మొంది
మిన్ను మన్నును నొకటిగా వృష్టి బలపె. ౯౧

మ. అంపష్ఠన్యుఁడు కేకిపాత్రములతో పాడించుచో మేఘమం
డలపుఁ మద్దెళ మ్రోంగ లేవను, మరున్మార్దంగికుం దర్థి నా
త్ర లలిన్ నేలపు ప్రాలుచు న్నెగయుచుం దారాడునత్తెల్ల జ
ల్లులుఁ గెంపుచ్ఛులు నయ్యె, ధారలును దల్లోలేంద్రగోపంబులున్. ౯౨

ఉ. ఓహరిసాహరిం బ్రథమ మొల్కొడుధారల గాడ్పు లేటవా
ల్గా హతి నీడ్చి, వీఁగుప్రజలం గలఁప. న్మొగి లొందె నంబుభృ
ద్వ్యాహచలద్రథత్వము, మొద ల్మెఱుఁ గన్ ధ్వజ మెత్త నొటగాఁ
నాహదనం జెలంగుజన మాంతము నూ[illegible]ోవ రామియున్, ౯౩

తే. మిగుల నామనిఁ బచ్చ చాంపేయకముల
నమ్మి, కడపఁ దమి వైచి, నాఁడు మగడ
నాసపడువారి నవ్వెన ట్లల్ల విచ్చెఁ
గలయ మూతులు కేతకీగహనతతులు. ౯౪

చ. అనయము నందనంపు దివియందునె యుండి, ప్రసూనవాసనల్
గని, పలతెంచిపోవు నలకారుమెఱుంగులె పోవ రాక చి
క్కెనొ నవగంధలుబ్ధభుజగీపరివేష్టన నా, మొగళ్ల విం
డునఁ జెలఁగెం బసిండితగడుం దెగడుం బువురేకు మొత్తముల్. ౯౫

చ. బలుసెక నించువి ల్లడుగుఁ బట్టినదే యిపు డాకుబూది గెం
పులఁ ద్రిరుచిత్వ మూఁది, మరుముష్టి బిగిన్ దివిఁ గ్రాయు మౌక్తికం
బులజడి జుమ్మనం దొరఁగుఁ బో; యిది యింద్రునిదేని, పుట్టఁగాఁ
గెలనమొ నాఁగ బో ల్విలు జగిం గరకాస్రుతి నొప్పె మేఘముల్. ౯౬

చ. అతిజల మబ్ధిఁ గ్రోలెఁ నితఁ, డంతయు రా నతివృష్టిదోష మౌ;
మితి నిపు డబ్ధతం బరిణమించినతోయమె చాలుఁ బంట; క
న్మతి నలదాత గట్ట గగనంబున, వర్తులత న్సమంతతో
వృతి యగు సేతుమండలము శ్రీ పరివేషము సుట్టెభానునిన్. ౯౭

తే. గగనరంగస్థలంబున మిగులఁ బ్రౌఢి
మమునఁ గాళిక నీలికోలము నటింపఁ,
బోరి మొగంబున రాలునిప్పుక లనంగ
గుంపులై రాలె మహి నింద్రగోపకములు. ౯౮

క. ద్యుమణికరాళి మొగిళ్లయి
యమవస శశి గలయఁ గూర్చి హద నౌటయు, న
య్యమృతపుబిందులె క్రమ్మఱ
నుమిసెడు ననఁ గలయఁ గరక లుడుగక రాలెన్. ౯౯

చ. స్ఫురణ మొగిళ్లపై మొదలఁ బొల్చెఁ జలస్రుతి నాఁడునాఁటికిం
గరఁగుచుఁ బుట్టుచుండుమణికార్ముకరక్తిమ యెల్ల వెల్లిఁ గె
న్నురువులు గట్టినట్టులు గనుంగొన నొప్పెఁ దదింద్రగోపముల్
గరఁగినపిండ్ల యప్పనసుకై వడిఁ దెట్టువగట్టుపచ్చికన్. ౧౦౦

చ. పెళపెళ మబ్బు విట్టులుకు, భీతి విదూరశిలాంకుర చ్ఛటో
త్పులకిని యై ప్రియు న్నిదురవోవుహరి న్వడిఁ గౌఁగిలింపఁగాఁ,
దలరి ధరిత్రి సాఁచుగఁబుదాలువుఁగేళ్ళనఁ గంకణంపుమ్రోఁ
తలఁ బులు దేల వండు పయిఁ దాల్చి నదు ల్వెసఁ జొచ్చె వారిధిన్. ౧౦౧

తే. కేకిషడ్జంబె దక్కఁ గోకిలపుఁబంచ
మం బణఁచెఁ, దోయిపదరులు మతి పొసఁగమి,
నదియుఁ బ్రియుఁ గూర్ప నదులచో నమ్రత మయ్యెఁ
బ్రోషితల చేరువకు నంపుబోటివోలె. ౧౦౨

తే. పతతనువు రాహు సోమామృతంబు ద్రింగఁ
జక్రి దునిమినమెడఁగంటిచాయఁ బొలిచె,
వసిన మేఘస్థమణిధను వాసువర్మ
నం బనఁగ నింగిఁ బ్రతిసూర్యబింబ మలరె. ౧౦౩

చ. స్వరుఖరతాప్రసాహిరిపుజాలమబాచిరరుక్మిశిప్రవళా
కరకబకాచ్ఛవాప్రస్ఫుతులకై లవణేక్షుసురాజ్యదధ్యుదా
కరములు దుగ్ధశుద్ధజలకంధులు నాఁ గలయట్టి సప్తసా
గరములు మేఘుఁ డానెనొకొ తా యనఁగాఁ గనుపట్టె వీనిచేన్. ౧౦౪

మ. తనిమం బచ్చ మెఱుంగుఁగోఁచియు మణీధన్వోజ్జ్వలాషాఢముం
గొని, పుట్టం గొడుఁగబ్బ నెమ్మి పురియాకు ల్వ్రేప్పి శబ్దంబు మిం
చ, నతస్ఫారరజోబలిత్వమున నచ్ఛస్ఫూర్తి మించ దన్ని వే
ఘననీలాంగుఁడు గాంచెఁ బాదపతతౌఘంబుల మరుత్స్పృష్టముల్ ౧౦౫

క. ఘనవృష్టికతన ఫణు లే
పున నలవల్మీకరంధ్రములు మూయఁగ నె
త్తినగొడుగు లనఁగ ఛత్రా
కవికాయం బవని నెల్లకడలం బొడమెన్. ౧౦౬

ఉ. సారెకు మింట మేఘుఁడు నిజస్ఫురణం బఱఁ గ్రూరమౌ పురో
గారకయోగ మూఁది తిరుగ, స్వకుటుంబముఁ దద్గ్రహంబు నెం
తే రుష ద్రొబ్బ నంతలును నింతలునై పడు తన్నభశ్చ్యుతాం
గారశిఖవ్రతానములకై పడి రాలె సురేంద్రగోపముల్. ౧౦౭

క. కాకోదరాహితుల వ
ల్మీకంబులఁ దూర్చి మెఱసి మేఘుం, డని గుం
పై కనగొని పొగడె ననన్
భేకధ్వను లెసఁగె వృత్తభేదానుకృతిన్. ౧౦౮

తే. మొగిలు మైచీకటుల నెక్కు జిగిమెఱుఁగులఁ
బగలు రాతిరి రాతిరి పగలు చేసె;
సకలమును నిద్రపుచ్చు కేశవుని నిద్ర
పుచ్చుఘనునకు నిట్టి దద్భుతమె తలఁప ? ౧౦౯

తే. ధూళి యడఁగిన మటి మింటఁ దోఁచె శంప,
జలధరద్రోణి మన్ను పర్జన్యుఁ డెత్తి
ఖనది ఖశ్రీవిభూషేచ్ఛఁ గడుగ మెఱయు
మృదుమహీగతవసురజోరేఖ యనఁగ. ౧౧౦

తే. స్థూలపరిపక్వకాననోదుంబరాగ్ర
రంధ్రముల వానసీరు సొరంగ వెడలె
మశకవంక్తులు దావధూమంబు లణఁగ
రచ్చ సేయంగ వెడలె విశ్రాంతి కనఁగ. ౧౧౧

స్రగ్ధర. గ్రావాలం గేతకీకోరకకుటజరజోరాజి మూర్వ్యంకురశ్రీ
తో వీక్షింపన్ దినాన్ముత్తుటి షట్పదచయం దోఁచు, చిట్లా శిరో
వావిర్భావంబులం బాయక పొరయ నభస్స్వద్భ్రమ ల్గప్పి, పైనెం
తే విప్రేంఖిత్కల్ బర్హిణులు దిరుగఁ, బెల్లింద్రజాలంబుఁ జూపెన్. ౧౧౨

తే. గిరులఁ దటజంబుతరువులఁ దొరగ పండ్లఁ
బుట్టె జంబూనదులు; గానఁ బొదవు మొగిలు
మేన నవి సోఁకునెడలు గామితఁ దటిచ్ఛ
లంబునను శుద్ధజాంబూనదంబు లయ్యె. ౧౧౩

తే. సురభిబడిఁ జన్న సప్తలాశోకకమల
కువలయామ్రమాళికిఁ గదంబ కుటజ నీప
కకుభయూథిక లను సాయకములు మరున
కెను గల్గి గేదఁగినురె యెక్కు డయ్యె. ౧౧౪

క. నటనపర కేకిపాత్ర
స్ఫుటయవనిక లన మొగిళ్లు పొదివెన్ భూభృ
త్తటుల, నవి యాకు దిను చిట
పొటరవము సెలంగెఁ దాళముల చప్పుడు నాన్. ౧౧౫

చ. జలధర ముప్పుతోఁ బులు పొసంగు రసం బని యప్పయోధి నిం
పొలయఁగఁ గ్రోలి, పై దధిపయోధియుఁ గ్రోలఁగఁ, గ్రాఁచి దొటఁ బె
న్బులునుఁ గరుళ్లు గ్రాయ, నవివో వడగండ్లన రాలెఁ, గానిచో
నిలఁ బడ వానిఁ దిన్నయవుడే చలిపండ్లు వడఁగ నేటికిన్ ? ౧౧౬

తే. అవు డనళ్లకు డిగక మేఘాళి పొదువ
నచలములపైనె దొడ్డిక ట్టగమ్మృగాళి
జాడ చూవట్టె మీఁదివర్షన్యధన్వి
నృపున కగుతెరవేఁటయాయిత మనఁగ. ౧౧౭

చ. తడి తల డిగ్గి ముంప, జడతం దుదరెప్పలఁ గన్ను వీడి, వ
ల్పొదుచుచు నీర్చు ముంగలిపోలిక ముక్కులఁ గూడ, నోరఁ గొం
తొడియఁరు గూఁటికట్టు సగ మొత్తుచు తెక్కవిదుర్చు మున్నుగా
వడఁకుచె గాక చేష్ట డిగె వక్షము పక్షులు జానువుల్ చొరన్. ౧౧౮

క. చెందు నెఱసంజ కుంకుమ
క్రందునఁ గెంపెక్కు దివికిఁ గాశ్మీరత రా,
నిందుశిలాత్వము రవి గని
యెం; దోయముఁ గురియ నేల యిటు గాకున్నన్? ౧౧౯

చ. అలజలరాశినీటఁ బగ లర్కకరావళి చూలు దాల్పఁగా,
నలమిన యార్ష్య రాత్రి ధవళాంశుకరాళులు తాము దాల్పఁ, ద
జ్జలములు నాన మూఁగికొనుచాడ్పున నాడి వహించెఁ జూలు మ
బ్బుల నిల ముంచునీలఘనపుంజపు వల్ల బలాకమాలికల్. ౧౨౦

క. ఉఱుము విని యలకకై దివి
వెఱఁ బఱచుమరాళపటలి విడిచినఁ బడున
క్కఱచిన బిసలవవిసరము
తెఱఁగున వడగండ్లు ధవళదీధితి రాలెన్. ౧౨౧

క. తటిదుత్సారితఫణభృ
త్పటలి నిరన్నంబు లయ్యెఁ దక్కువ బర్హుల్
నటన; మతిహర్షహేతూ ౧౨౨
త్కటలాభం బిడునె మది క్షుధ స్ఫూర్త్యట్టుల్?

సీ. రవిఁ జూచి కుకుచువారలకును గృకలాస
ములకును దృష్టి మిన్నులనె నిలిచె:
సంధ్యార్ఘ్యదాయిద్విజశ్రేణి కిలు నేరు
మొదవులకును భ్రాంతి మది జనించె:
హాలజీవిసందోహములకు బలాకికా
వినరంబులకు మంచి వెగలు దొరకె:
నెలమిఁ బొల్పుగయూథికలకు నంతలకూట
ములకును మఱి విచ్చుమొగ్గ లొదవె;
తే. నతిథిసంఘంబునకు నీనినట్టియెనువ
కదువులేఁగలగుమికి వాకట్టు లెసఁగె.
మట్టిమిద్దెలవారికి మురుపనులకు
నెలఁతఁ బాసినవారికి నిదుర చెడియె. ౧౨౩

ఉ. కాలునిదున్న నంది నయి గంటలు దున్నక మంటి నా. మహా
కాలునినంది దున్న నయి కర్దమమగ్నత లేక మంటి నా,
హాలికు లెన్నఁడుం దెగనియారులచేలును జొౌకుమళ్ళనుం
గా లలి నేరు సాఁగి రిలఁ గల్గుపవిం గొని పేద మున్నుగన్. ౧౨౪

క. వరఁజుబడి రొంపిఁ ద్రొక్కఁగం,
జరణంబులఁ జుట్టి వసిఁడి చాయకడుపులం
బొరి నీరుకట్టె లమరెను,
బిరుదులు హాలికులు దున్నఁ బెట్టిరొ యనఁగన్. ౧౨౫

క. నాని శిఖి వంటచెఱకుల
చే నఱ. నవి వెండి వంటచెఱకులె యగుటం
బోనంబు ప్రజకు జక్కఁల
బోనంబులె యయ్యెఁ బ్రొయ్యి పొగయమి వృష్టిన్. ౧౨౬

సీ. ఇల్లిల్లు దిరుగ నొక్కిం తబ్బు శిఖి: యబ్బె
నే నింటిలోఁ బూరి యిడి వినరక
రాఁజదు: రాఁజిన రవులుకో ల్యాసాలఁ
గాని కల్గదు: మఱి దానఁ గలిగె
నేని కూడగుట మం: బైన బెన్పొగ సుఖ
భుక్తినేకూర: దాభుక్తి కిడినఁ
బ్రాగ్భుక్తలకె తీఱు బహుజనాన్నము: దీఱ
నారుల కొదవుఁ బునఃప్రయత్న:

తే. మాజ్యవటముఖ్యలయ మెన్న: రాలయాంగ
దారులయ మెన్న రంతిక: కారజనిక
వచన నాంధోగృహిణి తామిఁ బడుక మరుఁడు
వెడవెడనె యార్చ నొగిలి రజ్జడిని గృహులు. ౧౨౭

చ. పిడుగుల కల్కి లోఁ దొలఁచి భీరులు కంచముఁ, జల్లుదీధితు
ల్గడవల వెళ్ళిరాఁ బొగలకావిరి బ్రుంగిన పుల్గృహంబు లె
ల్లెడఁ గనువట్టె నీళ్ళ నిలయెల్లను ముంచి రసాతలంబు పై
విధియఁగ దండు డిగ్గినసవిద్యుదురుస్తనయిత్నులో యనన్. ౧౨౮

చ. గొడుగుల గాలిఁ గూల్చి, మఱి కోలలతోడనె పాఱ, నార్చెఁ జె
ట్టడ జడి మేఘుఁడు ట్టకట పాంథులపైఁ దన కెంతవైరమో!
తడిసిన మేన నింకి యది దారవియోగజవహ్నిఁ గొంత కొం
తుడిసె, విధాతరక్ష విష మొక్కొకమా టమృతంబు సేయఁగన్. ౧౨౯

తే. దవులఁ జల్లని తూఱ నంతక మునువటి
జల్లునీ రూని వచ్చునాజల్లు, మొదలి
గాలి యెలగోలుచేఁ గొమ్మగదలి జల్లు
దలవడకమున్న వంగుళ్ళఁ దడిపెఁ దరులు. ౧౩౦

చ. రయమున వృష్టికై యొదిఁగి రచ్చలపై. విధియింతు రుగ్రతన్
హయపతిమీఁద దంతిపతి నాతనిపై నృపతిం గజాదిని
ర్ణయముల మొత్తులాడుదురు, క్రమ మొక్క యింతయు విప్ప విచ్చు మొ
గ్గయి మఱి పొసిపోదురు సమస్తదిశాగతులైన యధ్వగుల్. ౧౩౧

క. తనరెబలిభుక్తతులు నిం
డినగ్రామశ్రీల కఱితినీలము లగుటం
గనియెఁ దృణగ్రాహిత ననఁ
గొనుకసవులఁ జైత్యతరుల గూండ్లిపుభ్రమణన్. ౧౩౨

మ. వనతు ల్వెల్వడి, వానకై గుడిసె మోవన్ రాక తా నాని యే
వనగా నిల్చినజమ్ముగూడఁ బొల మంబ ళ్ళొమ్ము చుచుం బట్టి పె
న్మానుపు న్నీఁగెడుకాఁపుగుబ్బెతలపెన్గుబ్బ ల్పునాన ల్వెలిం
బిసికిళ్ళుం బిసికిళ్ళు హాలికుల కర్పించె న్నభస్యంబునన్. ౧౩౩

మ. గురుగుం జెంచలిఁ దుమ్మి లేఁదగిరిసాకుం దింత్రిణీపల్లవో
త్కరముం గూడఁ బొరంటి నూనియలతోఁ, గట్టావికుట్టారుగో
గిరము ల్మెక్కి, తమిం బసుల్వొలము వోఁ గ్రేఁపు ల్మొయి న్నాక, మే
కెరువుం గుంపటి మంచ మెక్కిరి ప్రభుత్వైకాప్తి రెడ్లజ్జడిన్. ౧౩౪

సీ. మణియష్టిఁ గేలిబ ర్హిణషడ్జనుథ పీను
లోలాడఁ బ్రొ ద్దెక్కి మేలుకాంచి,
గమగమవ త్సుమగంధరాజాంగమ
ర్దనపైఁ జిరోష్ణమజ్జనము లాడి,

మినిమిదువ్వలువ బన్ననరఁబు మొగలితే
కులు దాల్చి జామెక్కి కొలు వొనంగి,
జాఁగలామిషముతో శాల్యన్న మధికహై
యంగ్రపీనంబుగా నారగించి.

తే. మృగమదము మించుతనులంపుటీరులు మోవి
దశముగా సాగరుహసంతి వెలుఁగ, సౌధ
శిఖరవాతాయనాగతాబ్జరుగంశు
నతదృగవరోధములతోడ నగరి నృపులు.

వ. ఇట్లు సాంద్రసలిలధారాసారమానరంబు లగు వార్షికవాసరంబులు ప్రశాంతంబగుటయుఁ దదనంతరంబ. ౧౩౬

## శరదృతు వర్ణన.

ఉ. రాజమరాళలబ్ధగిరిరంధ్రము, శాలివనీశరావలీ
వైజననంబు, యజ్వహుతవాజహుతాశము, భాస్వదిందిరాం
భోజనమాగమం, బుదితబోధభుజంగశయోపచారనీ
రాజనపుల్లహల్లకసరం, బుదయించె శరద్దినం బిలన్. ౧౩౭

క. కరము పొగ రెక్కె నంబర,
మురువిద్యుద్దీపకళిక లుమిసిన ధూమ
స్ఫురణఁ బొగచూరె ననఁగా
హరిమణిజంబూఫలానితామలరుచులన్. ౧౩౮

ఆ. సాంధ్యరాగలహరి సామిరంజితము లై
తిరిగె మింట సిదుర తెలిపినట్టి
యిందిరాధిపతికి నెత్తు కర్పూరనీ
రాజనంబు లన శరద్ఘనములు. ౧౩౯

మ. అళిగరుద్దంచలామల తదంతరబింబిత మయ్యెఁ బాకని
ర్దళితమహాఫలౌఘహరితచ్ఛదకర్కటికావనాలి నాఁ,
గలమవనక్రమచ్ఛుకనికాయము లోపల సాంధ్యరక్తిమం
బలఁతిగఁ దాల్చి మింటఁ గన నయ్యె విపాండుపయోదఖండముల్ ౧౪౦

క. ఘనగణవిహరణఁ జివికిన
మణిథనువువఁ దొరుఁగు నుసి సమానము లై ద
ర్పణనిభనభమునఁ బరిణత
శణకణహరిణములు పాండుజలదము లొలసెన్. ౧౪౧

క. రవిశశిముకురములు శర
ద్యువతి మెఱుఁగుఁబెట్టుభూతియో యనఁ బర్వెన్
బవనాహతన ప్తచ్ఛద
నివహపరాగంబు చివికి నిర్మలకాంతిన్. ౧౪౨

స్రగ్ధర. సంభూతజ్ఞప్తివాతాశనశయనము విశ్వంభరుం డూఁది చేవం,
గంభీరప్రక్రియామగ్నత డిగు జగతిం గ్రందుగాఁ దోఁచువర్షా
దంభోశిస్థూలరంధ్రోద్గతసితపృథుపాతాళజాతాఁబుధారా
స్తంభంబు ల్పోలె నెన్నుల్ధవశరుచి శరత్సంభవం బిం జనించెన్. ౧౪౩

తే. నీరజేక్షణుఁ డవ్వేళ నిద్ర దెలిసి
యడుగుఁ దనపీఁటఁ మోపనో యవనిరమణి
కంటకితగాత్రి యయ్యె నాఁగా విపాక
పరుషకంటకాలిమంజరులు వొలిచె. ౧౪౪

మ. స్ఫుటభూయోహ్రుతిశంక వార్ధి నినరశ్మ ల్మిన్ను చేర్పం, దటి
చ్ఛట లౌర్వంబుగఁ గారుకొంచు, ఘనమై, క్ష్మాఁ దీఱ వర్షింప, న
చ్చొటనుం దోఁచి గ్రసింపఁ బోలుఁ గలశీసూనుండు! గాకున్న నొ
క్కొ_టఁ దావాగ్రహభాస్కరేందుమణిశుక్తుల్యక్తమై తోఁచునే? ౧౪౫

చ. అలమలయాద్రి కుంభభవుఁ డన్కతకంబు శరత్తు కుండమం
దలి ప్రతిబింబ కైతవమునం దమ కిచ్చిన. వారిదేవత
ల్తొలఁకులకేలఁ దావ నిడి తోమఁ గడం కడఁగెం, దదీయత
త్పలతకు హ్రస్వమౌటె కరి, తారక లంబువుఁ దేర్చునే యనన్ ౧౪౬

చ. ఇలకు సుధాసమత్వము రహింప శరజ్జలజాక్షి కుండమం
దలి సలిలంబుఁ గల్మష ముడంగ మొగిల్విరియెండఁ గాఁచుచోఁ
జిలుకు నిశారజఃపటలి చెన్నువహించెఁ దొరంగపంక్తిపై
చెళ దరవింద కైరవ కదంబ కధార వరాగపూగముల్. ౧౪౭

ఉ. మెచ్చినమైత్త్రిఁ బద్మినుల కెల్ల ఘనాత్యయకారుకుండు సొ
మ్మచ్చుపడంగఁ జేయ నొకనై యలక్రౌంచనగంబు పేరి క
మ్మచ్చున నీడ్చు శర్వగిరియందలి వెండిశలాక పిండు నా
వచ్చి మరాళమాలికలు వ్రాలెఁ గొలంకులఁ జక్రచంక్రమిన్. ౧౪౮

తే. కుంభజుఁడు హార్దితోఁ గ్రోలి కుక్షి నున్న
మించుముక్తాచ్ఛటలె క్రుమ్మరించె ననఁగ
జలజదళములఁ దేటలుఁ జవులు నయిన
యంబుకణములు వొలిచెఁ బద్మాకరముల. ౧౪౯

చ. కెరలు స్రవంతిఁ బై యిసుక క్రిందగు వేళ నినుండు మేఘపుం
దెర ననఁ జల్లఁగా, విరహదీప్తకరప్లుత మౌ నజీరకో
త్కరగడ మట్ల పద్మినులఁ గ్రమ్మఁ సకేసరమాధ్వి పొల్చెఁ, బైఁ
గర మరుదారెఁ దేంట్లు సెకఁగందిన ముత్తెపుసేసలో యనన్. ౧౫౦

చ. జలజదళస్థతోయములు సందులఁ గ్రందుగఁ దోఁచు మింటినీ
డలుఁ గనుపట్టె నత్తఱిఁ దటాకముల న్లఘిమంబు రెంటిలోఁ
దెలియఁ దరంగ బై కెనయు తేఁటులఁ జేరులఁ దూన్పఁ దోయము
ప్పొలుచనఁ దేలె: మిన్నడుగు బట్టెఁ గడుం దళమౌటనో యనన్. ౧౫౧

మ. ఇలకు న్వ్రేఁగఁ బండి తీరవనపుంద్రేక్షుచ్ఛట ల్దీవ ల
గ్గలమై వ్రాల, నురుస్వనంబు లెసఁగంగాఁ ద్రిప్పు రాట్నంపు గుం
డ్రలు నాఁ దేనెకొలంకులం బొరలి పాఱ న్విచ్చు పంకేరుహం
బుల నాడెం దొలునంజఁ దేఁటివలయంబు ల్తారఝుంకారముల్. ౧౫౨

సీ. హాలనపత్కదళ కందాభ తిర్యజ్ఞతా
స్యమునఁ గొమ్మొకటి మోసనఁగఁ గ్రుంగఁ;
గటముల డిగి చిబుకమున రే పేరిన
మద మంజనగ్రంథిమాడ్కి, మెఱయ;
ఛిద్రోత్థహతవలత్కద్రూజ మనఁ జుట్టు
తో విప్పుతోఁ దరిఁ దొండ మాడ;
తెల్లఁబెళ్లలు నీఁటఁ ద్రెళ్లి ఫేనము వండు
నయి పునఃప్రావృడాశయము నొనఁగ;

తే. ఘనరజోవృష్టి కై మీఁదికన్ను మొగుపఁ,
గటిదెసలు నిక్క, బరితోలు గదలఁ, గలు
మదముతి క్రత నదుల కీఁ, దదనుకృద్వృ
షాళితోఁ దేంట్లు వఱపఁ, గోరాడెఁ గరులు. ౧౫౩

శా. గండద్వంద్వగళత్కరాళమదరేఖల్ పుల్లిన ప్తచ్ఛదా
ఖండక్షోదసిత ల్పరికీర్ణకములై కర్ణద్వయి న్మించఁగాఁ,
గొండల్బ్రివ్వినమన్ను కత్తులగతిం గొమ్ముంగొన ల్ముంప, వే
దండంబు ల్చవుదంతు లౌటఁ దెలిపెం దండె త్తభూపాలికిన్. ౧౫౪

తే. అప్పు డన్యోన్యవిజిగీషు లైనదొరల
కవ దొనలనుండి లబ్ధలక్ష్యతఁ బడనిన
న్వకులశరపాళిచేఁ గీర్తిచాలఁగనెనొ
యన వనాళిఁ బ్రఫుల్లశరాళి మెఱసె. ౧౫౫

తే. దరులతడివందు పొదువుమూఁపురము లంటు
తెల్లుగంటల నాఁబోకు లుల్లసిల్లె,
గిరుల మోరుల నవి సముద్గీర్ణసలిల
జలదరచ్ఛేదములు ప్రాలఁ మెలఁగుకరణి. ౧౫౬

తే. గగనలక్ష్మి నిజోరు నక్షత్రమాలి
కలు వియన్నది జలములఁ గడుగఁ బినుక,
నెఱయు కుంకుడుఁబండులనుఱువు లనఁగఁ
బలపలని పాండురాంబుదవంక్తు లమరె. ౧౫౭

శా. అప్పు ల్వారిధిచేతఁ బుచ్చికొని, కార్శ్యంబైన, మున్నొప్పుయ
య్యప్పు ల్దో చనియు న్సవృద్ధికముగా నవ్వార్ధికే తీర్పఁగా,
నప్పుణ్యాత్మవిశుద్ధజీవులు నిజాచ్ఛాంగంబులం దోఁచు న
ట్లొప్పారె న్మళిబింబగర్భితములై ద్యోచారిశుభ్రాభ్రముల్. ౧౫౮

చ. విశద పయోదవుంబొరంవేష్టనచే నొకమై నభోమణిన్
లళినపటంబు వొందుట పనంబున నారసి, కాంచి, విష్టుఁడ
య్యళివత కై పదంబు వలయంబునఁ బావి, యవస్తులోళక
త్కళతఁ బ్రబోధ మొంది, సిరిఁ గాంచి చెలంగెఁ బయఃపయోనిధిన్. ౧౫౯

ఉ. అంబరవాసు లగ్నిఁ గ్రియకై ద్యుమణిస్ఫటికోపలంబునం
దుం బడయ స్మరజ్వలదతూలపరంపరఁ గొంత పై ఘటిం
పం, బెలుచం జనించి, యొక మట్టున నిల్వక యాక్రమించెఁ గాఁ
కం బరితాప మూన ననఁ గాసె మొగి ల్విరియెండ లత్తఱిన్. ౧౬౦

క. కంజహితాస్తోదయముల
సంజకడల, నడుమఁ గప్పు, సంధిల, మిన్నొ
ప్పెం జూడఁ బ్రకృతిశబరీ
గుంజానాసాపభూష కొమరు భజింపన్. ౧౬౧

తే. గూండ్లకై శాలిమంజరు ల్గొనుచు, మూఁగి,
యంబరంబునఁ బఱచు కీరాళు లొప్పెఁ,
బసరుటొండొంటియాకుతోఁ బండఁ బాఱి
ఛేదభయమున నెగసిన చే లనంగ. ౧౬౨

సీ. శ్రీలు దా రౌట నాశ్రితపద్మకర్ణికా
కృతిఁ జెవు ల్కమలకర్ణికల మెఱయ;
నతనుసాంథ్యకృద్రతిరేఖ మంచెపై
నడలించు రొద చిల్క వదువుఁ బఱవ;
దొగమొగ్గలను వైష్ణ దూర మేఁగమిఁ బెట్టు
చప్పట్లఁ జన్నులు జడలు గదల;
పెదత్రోవ మును చెప్పి, పడి నవ్వ, దిరుగు న
ధ్వగుకొలందినె యపత్రపయు మరల,

తే. నధర రదనప్రసాదంబు నడుగ నోరు
దెఱచె ననఁ బండి ప్రేలి ముత్తెములు తోఁచు
చెఱకు జంఘులఁ బోలమి శిరసు వాల్చు
తాజనముఁ గాచు గోపికారాజి వొలిచె. ౧౬౩

తే. నింగి యత్తఱిఁ దా మహానీల మైన
గరిమకుం దగ బహుతృణగ్రాహి మయ్యె.
ననఁగఁ బరిణత కలమాది యవసరాశి
తతుల గిరు లన నభ్రంకషతఁ జెలంగె. ౧౬౪

మ. అలయనిష్ఠన్ దవశాతపత్రి దగునయ్యాగంబు పొగంగ, నం
మ యమిశ్రేణులు రాఁగఁ, బుంగవక కుత్స్థుం డల్ల వర్షాదినా
త్యయరాముండు సలక్ష్మణుం డినున కోజోవాప్తిగా, విల్లు ని
ర్దయతఁ ద్రుంపఁ, బ్రభగ్నశాల్యవని సీతాలబ్ధి గాకుండునే. ౧౬౫

క. మొగిలువిరియెండ వేఁడిమి
నిగుడ, శుకశ్రేణి పనరు నింగి న్నిండన్,
బెగడెఁ బ్రజ. హరితవాజుల
గగననుణిస్యందనంబు గదిసెనె యనుచున్. ౧౬౬

తే. భువి నరశ్శైరవశ్రేణి పోవఁదోల,
దివిఁ గనద్గ్రహనక్షత్రదీప్తి దఱుమఁ,
గృష్ణపక్షపువాసి లే కిరులు దనదు
నలుపునను గూడె నన నైల్య మొలసె నభము. ౧౬౭

క. క్రేపుఁ దలఁచి పసి మేయుచుఁ
జేపినపొగ్గలయ నొడచేఁ బాంథజనుల్
దూపింపమి కఱుఁ డంపిన
యాపొగ యనఁగ నదుల నంచలు మెఱసెన్. ౧౬౮

తే. వెదమొనవుకూడఁ బోలేనివెచ్చ గ్రొవ్వ
కల్ప మెదటాఁప నెతలెనో యనఁగ, నెట్టి
తేలకును గ్రుంగి తెచ్చు అంకెలు నిగుడఁగ
మందగతి గున్కె వృషభము ల్మందపిటుఁద. ౧౬౯

తే. శరధిజల మెల్ల రిత్తగాఁ గురియ, నుపుఁ
డొక్కఁ బేరిన, నత్తెల్పె చిక్కె మీఁద
గాన నగుచున్న దచ్చుతచే, ననంగఁ
బఱచు శరదభ్రములమేని పొండు వమరె. ౧౭౦

క. శరనిధి మును గ్రోలిన ని
ర్భరజలములు గురిసి, మేఘభావం బఱి, య
క్కరములు కరములె కా, జిగి
నొరిమె, నవన్ రవియు మెఱసె, నుడిగెను మొయిలుల్. ౧౭౧

క. ప్రాశించిననీ రంతయుఁ
బో, శరదభ్రములు మగుడఁ బూరింపఁగ, నా
వేశించెఁ గొలంకుల ననఁ,
గాశప్రతిబింబపటలి కడు నొప్పారెన్. ౧౨౨

తే. కొలనఁ గరిదంపతులు పద్మకళిక లొకటి
కొకటి యీ నెత్త, మకరంద మొలుక, నమరె
నల శరత్పద్మనిలయకు నెలమితోడఁ
గవగ నభిషేకమున కెత్తు కడవ లనఁగ. ౧౨౩

తే. పంక మడుగంటి తేఱిన బావు లెల్లఁ
బంకములె చేసెఁ గ్రమ్మఱఁ బంకజములు
గళితమకరందయుతరజఃకర్దమమునఁ;
గారణగుణంబు గలుగదే కార్యమునను. ౧౨౪

క. ఒసఁగి రగస్త్యార్ఘ్యములం
గొనరి జను, ల్వార్ధి నీరు గ్రోలితి వీని
ర్పసికై మా కిమ్మని క
న్కొస రుడుగం గావ నప్పగించెడు కరణిన్. ౧౨౫

క. పరుషాతపతప్తం బగు
ధరణీపాత్రమునఁ బడుట దళ మయ్యెఁ జమీ
పరిపక్వంబై, యనఁగా,
శరదిందుజ్యోత్స్న రేల సాంద్రతఁ గాసెన్. ౧౨౬

తే. వృష్టి తతి నిడ్డజెనఁ ద్రావఁ గ్రిందనుండి
తేట నదినీటఁ దనవెంటఁ దేలుమీల
తళుకుతో నాఁచులత దోఁచె వెలికి, జమిడి
వెండి మీ లెక్కు వెంద్రుకవిల్లువోలె. ౧౨౭

క. హంసము క్రౌంచముతొలి తా,
మాంసలరుచి వచ్చెఁ దాను మలయము శిఖఁ; బాల్
హంస విఱువ, నీ ర్వెఱిచెను,
హంసమున కగస్తి పరమహంసం బగుటన్. ౧౨౮

తే. క్రౌంచ మొకకొన్ని గ్రుడ్డులు గాంచె మింట
నవి యహంసచ్ఛదాచ్ఛాదనాకభూతి
హంసతతు లయ్యెఁ, గా దన్న, నరుణ చూడ
గుప్తభుజగాశనాంతము ల్గుఱులు గావె? ౧౭౯

చ. కలయఁగ వారిదేవతలు గాంచు సరోవరదంభదర్పణం
బులపఱు దట్టపుంజిలుము వోవఁగఁ దాఘకుంచము గీయఁగా
బలె నలువంకలం గలయఁ బాయక తేలుచుఁ బద్మరేణువు
ల్కొలఁకులఁ బాసి పోఁ జెఁగి గ్రొక్కృతు లిచ్చె మరాళమాలికల్. ౧౮౦

సీ. అర్కమండలి కభ్ర మడ్డ మైనంతనె.
యెఱ మాని మోము బిట్టెత్తి చూచి
ఘుమఘుమధ్వని గాలి గుహఁ జొరఁ, బురి యొకిం
చుక యెత్తి కని తలంచుకొని వంచి;
నిమ్నప్రకేతకీనేత్రాంబు వొత్తి, భే
కవుఁడెంకి పడియచోఁ గర్ణ మొగ్గి;
కేకకుఁ ద్యక్రివనతగ్రీవ మై రాక యొ
క్కింత ార్చి, వాత నేమేము కమిచి;

తే. వెకలు బీతొకకును శరద్వృక్ష మీఁగి,
వార్షికమె యెక్కి, క్రోవి నిర్వంకఁ బక్ష
తులను నివురుచు, వెక్షిమావుల నురంబు
కెంఁకులఁ గనుంగొనుచుఁ గానఁ గేకు లుండె. ౧౮౧

క. వెలుతు రస లంటి యెండియు,
లలి, విప్పమిఁ, జెడక, శిఖికలాపము వని వ
ర్తిలెఁ, బర్జన్యుఁడు నటన
మ్ముల మెచ్చి మెఱుంగుఁగాసె ముద్రించె ననఁ. ౧౮౨

సీ. చక్ర స్తనప్రకాశమునకు ఫేనంపుఁ
గొం గిడి గొనగొనఁ గోళ్ళ గొణఁగి;
యశ్మనితంబులు హంసహారమును బ
రాగరేఖాస్వర్ణరశనముగను

జలశాటిపులినంపుజఘనంబుపై జాఱ
వ్యస్తవేతసభుజన్వస్తిక మిడి,
తనిమితో వెచ్చనై తటశరత్ప్రతిబింబ
హాసాళి బాష్పు లుచ్ఛ్వాసములకు

తే. నగుచుఁ, జెందొవకంటను నలిగి. త
లంటు కైయొత్తు పదనతి నలర, కువల
మధుపహరి నద్దిఁ జెంది పై మగతనముల
నొక్కె-కలఁ గూడుము స్రవంతు లుబ్బి పెనిచె. ౧౮౩

## యామునప్రభుని దిగ్విజయము

వ. ఇట్లు శరత్సమయం బెసంగిన నంగీకృతక్షత్రియధర్ముండు గావున దిగ్విజయయాత్ర ధర్మం బని యానీతబలషట్కంబుగా నాకృష్టసామంతరాట్కంబుగా వెడలి. ౧౮౪

### మహాస్రగ్ధర

గజఘోటస్యందనాశీకబళితధరణిం గ్రాదవేయూధిరాఙ్మా
ర్ధజరత్నశ్రేణు లంతర్మఖులసవతులై క్రుగ్గఁ బాదాతకుంత
ధ్వజవాతాఘాతఘూర్ణద్వనధులరవము ల్వాద్యము ల్మిఱుగాఁ, ద
ద్ద్విజరాజస్యుండు విద్విడ్విదళన మనిఁ గావించె దిగ్జైత్రయాత్రన్. ౧౮౫

క. జన్నములు చేసి, దానము
ల న్నానాదేశవిప్రులం దనుపుచు నం
పన్నత ననిశము బహుళో
గ్రోన్నతుఁడై, యావె మఱచి యుండె నశంకన్. ౧౮౬

వ. మఱియు నతని రాజ్యంబునఁ గసవుఁ గఱచి చేయెత్తి మొఱపెట్టుట కరులయంద, యట్లట్లువడ మెడఁ బట్టి త్రోయుట వెడవెడం బోవుపల్లవులందు, బంధువ సంబంధులకు నింటికిం దెచ్చుపణ్యాంగనాభ్రాతల పరిహాసచేష్టలయంద; నున్నమెుపయుం బట్టుకారులంబట్టుపయు సౌధసౌవర్ణభూషాదినిర్మాణంబులయంద; కానెకట్టుటయుఁ గత్తిదాల్చుటయుఁ గృకవాకుల కలహంబులయందు; యతుల్య పలనాదిమర్షణా దోషంబులు జాంబూనద పరీక్షాములయందు; యేదేసియుం గన్నువేయుట మృదంగాదివాదిత్రంబులయంద; ధాతువాదంబులు

తఱచు దగంట శాబ్దికులయందు; కాక, యితరస్థలంబుల లేకుండ రాజ్యపరిపాలనంబు సేయుచుండె. ౧౮౭

తే. తత్పితామహుఁ డైననాథముని శిష్యుఁ
డైన శ్రీపుండరీకాక్షుననుఁగుశిష్యుఁ
డైన శ్రీరామమిశ్రాఖ్యుఁ డార్తిఁ దనదు
పరమగురుపౌత్త్రునకు నిట్టిబంధ మెట్లు ? ౧౮౮

వ. మోక్షసామ్రాజ్యంబు మఱచి సామ్రాజ్యంబునం దాసక్తుఁ డయ్యె; నట్టి మహాత్మువంశంబునం బుట్టినట్టి యితం డిట్లగుట యతివ్యతిక్రమంబు. ౧౮౯

సీ. వృషశైలఝురవారిఁ బ్రతిషవణస్నానంబు
సల్పఁ గావించి, యాహ్నికముఁ దీర్చి,
యేకాంతగుహతత్తటీకుశాసనమున
నుండి, లక్ష్మీశాంఘ్రిపుండరీక
మంకురత్పులక హర్షాశ్రువై దహరపు
ష్కరమున భావించి, నవిల దిరుగ
యజ్ఞోపవీతపద్మాక్షమాలికలతో
యోగపట్టికఁ గూడి యురము మెఱయ,
తే. శౌరిఁ బద్ధాంఘ్రిద్రవాస్తవ్యుఁ గొలిచి,
సతియు నాలర్కశాక మంచితము వండ,
వి ల్ముకుందున కర్పించి. వేల్మిఁ దీర్చి,
యిట్లు తనుయాత్ర వడపు మున్నితనితాత. ౧౯౦

క. తొగిఁబడి, విషయాతురు నవి
విడు మనియెఱుకం బెఁ గతిదె వేఁటే పగ ? నే
ద్పదరఁ గథామల నొకవెం
బడి దోఁపం బలికి మైత్రిఁ బాపుఁ యొప్పున్ ౧౯౧

క. వసుధం బుత్త్రాదికదు
ర్వ్యసనముసైతమును దండ్రి వారించుటకున్
వసపడ దఁట; మఱి రాజ్య
వ్యసనము వారింపఁ నెంతవాఁ డెవ్వాఁడున్ ? ౧౯౨

ఆ. నల్లఁ గ్రోల నిచ్చి మెల్లనె చివ్వంగి
నోటి జింకఁ దివియుఁ నేరు పొదవు
వేఁటకాఁడువోలె విషయాళివలనఁ ద
త్తృష్ణఁ దీఱ నిచ్చి త్రిప్పు టొప్పు. ౧౯౩

వ. కావున, నట్లయిన నితని నింక నుపేక్షింపరా; దుపాయంబునఁ జొచ్చి యొక్క రీతిం ద్రిప్పవలయు, నుర్వి నాహార దోషంబు విజ్ఞాననాశంబునకు మూల కారణం; బని వితర్కించి. ౧౯౪

క. ముల్లు దలకొనని నవకపుఁ
బల్లవములతోడ ముక్తిభామ చెవులకుం
బల్లేరుఁబువ్వులగు పువు
లుల్లసిలు నలర్కశాక మొదుగుగఁ గొనుచున్. ౧౯౫

తే. తెచ్చి, యొక వైష్ణవుఁడు గానుకిచ్చె, ననుచు
బానసపు బాపలచేతఁ బంపుటయును,
నతఁడు ప్రియపడి వండించి యారగింపఁ
దెమ్మ నిచ్చఁ, గొన్నాళ్లిట్లు తెమ్ముచుండ. ౧౯౬

వ. ఒక్కనాఁ డతండు భోజనసమయంబున నకలశాకాస్వాదనంబు సేయుచువచ్చి, తచ్ఛాకంబు నంజుచుం దలంచుకొని, 'యేత దానేతయగు భాగవతు భోజనానంతరంబ మమ్ముం గాన్పింపుం' డని పలికి, పాణిపాదప్రక్షాళ నాచమ నానంతరంబ గాన్పించుకొని, నమస్కరించి, వచ్చిన ప్రయోజనం బడుగుటయు, నతం డిట్లనియె. ౧౯౭

క. "మీ పెద్దలు గూర్చిన ని
క్షేప మొకటి సహ్యజాత సింధు జలాంత
ర్ద్వీపమున నుండ నీకుం
జూపంగా వచ్చితిని వసుమతీనాథా. ౧౯౮

క. నా కేటికి నిక్షేపము
నాకు, నిధియు నాకరంబు నరనాథుల సొ
మ్మే కాన విన్నవించెద,
నాకర్ణింపుము తదీయ మగువిధ మెల్లన్. ౧౯౯

సీ. స్ఫటిక మణు ల్గాఁల కాంత మై శ్వేత మై
నట్టి త్రాఁ చొక్కటి చుట్టియుండు;
రక్షోగృహీత మన్వాథ తొల్లి గల, దది
పొలయ దం దే డాఱు నెలలు గాని;
యేపాటఁబలి యైనఁ జేపడుఁ బ్రాణిహిం
సాదిపూజనముల కానపడదు;
తనవెలుం గొగి నిరంజనదృష్టికినె లక్ష్య
మై యుండు నయ్యె నింతంత గాదు;

తే. రత్న మొక్కటి పై ననర్ఘంబు మెఱయుఁ;
గలదు పద్మంబు శంఖంబు; పలుకు లేటి
కక్షయ, మనంత, మాద్య మేకాంతమందు
భూవ, నీకొక్కనికె కాక చూపరాదు". ౧౧౨

వ. అని విన్నవించిన నంతనించి, సేనాసమేతుండై యతండు మున్నుగా శ్రీరం
గంబున కరిగి కావేరీచంద్రపుష్కరిణులఁ దీర్థం బాడి రంగనాథుని సేవించి
సాభిప్రాయంబుగా నతనిం గటాక్షించిన నతం డిట్లనియె. ౨౦౧

క. "మీ పెద్దలు గూర్చిన ని
క్షేప మ్మిది గొ"మ్మంచు శ్రీరంగపతి
శ్రీపదయుగ్మముఁ జూపిన
నాపృథ్వీపతియు హతనిరస్తభముఁడై ౨౦౨

వ. గక్కునఁ దనపూర్వదశఁ దలంచి యిన్నాళ్ళు దన ప్రమాదంబునకుం బరమ
నిర్వేదన నొంది 'నీ వెవ్వండ ?' వనుటయు, 'నే మీ పితామహుం డగు నాథ
ముని ప్రశిష్యుండ; నయ్యోగివరుండు భావి భవజ్జన్మం బెఱింగి భాగవతవతం
సంబు వగు నీచేత నివ్విశిష్టాద్వైతంబు సకలభూతహితంబుగా వెలయంగలయది
యని నిశ్చయించి, నీకు ద్వయం బుపదేశింపు మని, తన శిష్యుండగు పుండరీ
కాక్షున కుపదేశించిన, నతండు భోగాసక్తుండ వైన ని న్నుపాయంబున దెలివి,
నీ కుపదేశింపు మనుటయుఁ, బనివింటి,' ననిన, సాష్టాంగంబుగాఁ బ్రణ
మిల్లి, యతనిచేతం బంచసంస్కారసంస్కృతుండై, యంత నిలుపక తురీ
యాశ్రమంబునకు రాఁగలవాఁడై స్కంధావారంబునకు మగిడి వచ్చి, కుమారునందు

రాజ్యభారంబుఁ బెట్టి, బంధుమిత్త్రామాత్యసమేతం బగు **బలచతుష్టయంబును**
బ్రకృతివర్గంబును నతని కొప్పగించి యిట్లనియె. ౨౦౩

## రాజనీతి

క. 'ఏవట్టున నినువక ర
జ్ఞాపరుఁడవు గమ్ము ప్రజలచక్కి; వివస్థు
ల్గూ పెట్టిన విని తీర్పుము;
కాపురుషులమీఁద విడకు కార్యభరంబుల్. ౨౦౪

తే. రాష్ట్రవర్ధన మెదఁ గోరు రాజు మేలు
రాష్ట్రమును గోరు; దానఁ గార్యమె యనంగ
రాదు; బ్రహ్మోత్తరము లైన ప్రజల యేక
సుఖముఁగోర్కెఁ దదంతరాత్మం బొసఁగఁడె ? ౨౦౫

ఆ. ఉజ్జ్వలయు నృపతి, కాభీరభిల్లాది
కంపకోల నూల నాజ్ఞ చెల్లు
నంట; సార్వభౌముఁ డైన భూపతి యాజ్ఞ
కెల్ల వారుఁ దల్లడిల్ల వలదె ? ౨౦౬

క. దుర్గము లాప్తద్విజవర
వర్గమునకె యిమ్ము; దుర్గవత్తతి క
త్యర్గళ ధరాధిరాజ్య వి
నిర్గతసాధ్వసత పొడమ నిలుపకు కొలఁదిన్. ౨౦౭

ఆ. మొదలఁ బెనిచి, పిదప గురియింత, నెవ్వాఁడుఁ
దనదు తొంటిహీనదశఁ దలంపఁ,
దలఁకుఁ; గాన శీల మరయుచుఁ గ్రమవృద్ధిఁ
బెనిచి, వేళవేళఁ బనులు గొనుము. ౨౦౮

ఆ. అనభిజాతుఁ, గీకటాలయు. నశ్రుతు
నలుకు మాని బొంకు పలుకువాని,
నాతతాయి, గడును, నన్యదేశ్యు, నధర్ము,
విడుము విప్రు నేల వేఁడితేని. ౨౦౯

క. తక్కువ మిగులం బతిచ్యుత
పక్షణవర్జితులఁ ; దొల్లి భ్రష్టగు విప్రుం
డొక్కం డలుగఁడె ప్రోచిన
కొక్కెరపై నొక్కపూఁట కూటికిఁ గాఁగన్ ? ౨౦౦

చ. చదివి యధర్మభీతి నృపశాస్త్రవిధిజ్ఞతల న్వయస్సు డె
బ్బదిటికి లోను నేఁబదికి బాహ్యము నై యరుజన్వపూర్వులై ,
మద మఱి రాజుప్రార్థన నమాత్యతఁ గై కొని తీర్పు పొఱవా
రొదవిన నంగము ల్మిగుల నూర్జిత మౌటకుఁ బూఁట సాలదే, ౨౦౧

వ. అట్టి మంత్రివర్గంబు దొరక దేని. ౨౦౨

శా. నీతిం దాన తలంచి చేయఁ బని గానీ కాకపోనీ, బల
ప్రాతార్థాఢ్యత నెమ్మి నంక కొనుఁ బ్రోవ న్మంత్రి యంచుం గణా
తీతుం, గుమ్మడికాయ యంత యగుమత్తెం బై మనం బేర్పు. న
ట్లే తా నాతనిచేతిలో బ్రదుకువాఁడే యౌఁ జుమీ మీఁదటన్. ౨౦౩

క. ఒక్కనివిరివికినె దొర
లెక్కండ్రే, నొక్కనొకని వెంబడి నసుఁగు
లెక్కండ్రు నిలువఁ బను లగుఁ ;
గక్కనము గుదింపఁ ; బెంపఁగాఁ గాకుండున్. ౨౦౪

క. ధనముఖ్యము కేవల మే
వనియుం గా, దాస్థ గలిగి పలువురు ప్రభువుల్
పనిసేయక, తద్వశ్యం
బువకు నలోభానృశంస్యముల్ ఋతముఁ జెలుల్. ౨౦౫

క. భాండాగారహయాద్యము
లుండియు నను వగు మనుష్యు లొదవమి నవియున్ ;
మండలి నవయ నరి కొదిఁగి
యుండిన సింహాసనంబు లుర్వి న్వినమే ? ౨౦౬

తే. బాహుజాంఘ్రిజ ముఖవిడంబనకు నయినఁ
గొలిచి మను విప్రధర్మంబు దెలిసి యైనఁ;

బూని సంకటములఁ జిక్కుఁ గాన; దలఁచు
బ్రాహ్మణునిఁ బ్రభుఁ జేయుట పతికి హితము. ౨౦౭

ఉ. ఆయతికాని కీడు మమరాలయముఖ్యము, లాతఁ దర్థతృ
ష్ణాయుతుఁడై నిజోర్వి నగునష్టికిఁ దద్ధనముం దొరల్చి, రా
జాయతనంబుఁ జేర్చు; మఱి యట్టి దపథ్యము, కాన నొంటిగాఁ
దే యధికారి గావలయు, నించుక తిన్నను వాఁడె రూపఱున్. ౨౦౮

చ. మును దనసీమ చేసికొని, మల్లిడి, గుద్దట వెండి చేనిమె
త్తనకయి పేరు వెల్లఁకియుఁ బ్రద్వేడు కర్షకునట్లు, శత్రుతో
నెనసియ యైన దుర్గబలమే కొని యైన, నిజాత్మ చింత లే
క నెగడఁజేసి, లోన మఱి కంటకశోధనఁ జేయు టొప్పగున్. ౨౦౯

క. మొదలనె యెరుదలకానిం
జెదరంగా నాడ కాత్మఁ జింతింపు; పదిం
బదిగ మృష యేని మఱి విడు
ముదస్తుఁగాఁ గాక యుండ నొక్క మతమునన్. ౨౧౦

క. ధరణి నసాధ్యనగాటవు
లిరవుగ భూపీడ సేయు నెఱుకుల పొరుగూ
ళ్లెర వగు నస్థిలిశూరుల
కెరవుగ నిచ్చునది, మిథము నెట్లయిన నురున్. ౨౧౧

వ. విశేషించియు నప్పార్వతీయబలంబు లోనం గూడకయున్న రాజునకుఁ బ్రజా బాధ దలఁగ; దెట్లేని బెదరు వాపి వారలం జేకూర్చుకొనవలయు; నవిశ్వాసంబును విశ్వాసంబును, నలుకయు నెలమియు, నతివైరంబును నత్యానుకూల్యంబును, నల్పులగుట నల్పంబునన యగు; నె ట్లంటేని. ౨౧౨

శా. విల్లుం దానును భిల్లుఁ డొక్కఁ దరుగ, న్వీం దింక దుర్గాన్నమున్
భిల్లుం డన్యుఁడు వెట్ట, నారయుదుక స్వీక్షించి, దొబ్బంచు వాఁ
డెల్ల న్వమ్ముగఁ జేసి, త న్ననువ రా, నెందేఁ దెగం జూడఁగా
నుల్లంబై, 'చన నంపు, నార చెడు' నా, నూహించి పో నంపఁడే. ౨౧౩

క. ఆపాలకూటనే నిజ
మేపాటియుఁ దప్ప దాడిరే; నెరనునఁ గొం.

తేపాటి గన్న నలుగుదు;
రీవని యెం తనక వెడఁగుఁబెద నాటవికుల్. ౨౨౪

తే. ఆటవికవశ్యకలన నత్యమున, వైరి
మనుజపతిమైత్రి దూతసమ్మానమునను,
గూర్మి దటీ భృతిఁ గొల్వురకును. సపారి
తోషికపుసేవ నెలమి రౌతులకుఁ గలుగు. ౨౨౫

క. మేలగు ఘోటకమును శుం
డాలంబును నాప్తసుభటునకె యిమ్ము; తటీ
న్మేలగు మెలవున మందురఁ
బాలింపుము; దొరలపాలు పఱుపకు మేపుడున్. ౨౨౬

తే. కార్య మొక్కఁడు గనిన మాత్సర్యమున నొ
కండు గాదని ఖండించుఁ; గన్నెఱింగి.
యిరువురను గాదనక కొల్వు విరిసి, మీఁద
నల్లవాఁ డెన్నినది సేయ నగు శుభంబు. ౨౨౭

క. పగ వెలిఁ గొని, లో దన్యులఁ
జిగిరింపఁగఁ జేసి, నృపతి చిక్కువడఁ బను
ల్డెగి సేయక, తారే ది
క్కుగ నడతు రశంక నల్లుకొని దుస్సచివుల్. ౨౨౮

క. ఇప్పింతు రాత్మవశులకుఁ
దప్పింతురు పరుల, కార్చి తప్పింతురు, 'రా
జిప్పగిదివాఁడె' యని వే
చెప్పినఁ బెరవారు నమ్మి చేరకయుండన్. ౨౨౯

ఆ. వాఁడిఁ బొదలు జఠరవైశ్వానరుఁడు గఫ
ప్రముఖదోషయుక్తి బలిమి చెడిన,
వెలి మహౌషధంబు బల మిచ్చుగతిఁ, బ్రతి
సేయ, వాఁడిమదముఁ జెఱుచుఁ బరుఁడు. ౨౩౦

వ. వారిమిగిలి ప్రతిసేయనెట్లం టేని, ౨౩౧

క. భండారముతో హయమద
శుండాలఘటాళి దనదు సొమ్మై పాగా
నుండిన, నాతఁడ వాయదె
పండితుఁడును బిరుదునైన పతికిని బయలై. ౨౩౨

క. కడుపున నొకకిడి దఱిఁగినఁ
జెడఁ జూచుటె కాక పతికిఁ జెలియుం గలఁడే?
ఒడి దండ విడువఁజెల్లునె?
నడప వలయు నేర్చినట్లు నమ్మకయె కృపన్. ౨౩౩

చ. ఒకటికి రోయకుంట గను మున్న వియుం, ద్రుపదుండు మారణే
ష్టికిఁ బసిఁ జూచి వేఁడ మునిసింపులఁ డొకండు తమన్న వేల్పుఁ? బం
డొకఁ డపవిత్రభూమిఁ గని యొల్లక యేఁ జనఁ దా గ్రహించె రో
యకనియెఁ. దాన నట్లెఱుఁగ నౌఁ. జపుసర్వముఁ గాన శక్యమే? ౨౩౪

క. పేఁ దెకరునఁ గి దెన్నిన
వాఁ డని, జయ మైన, హింస వదలి కొనుమ శ్రీ
పోఁడి; యహి యేమి గొబ బ
ల్యాడి సెడిన, నట్టిదయకు వైరియు నమ్మున్. ౨౩౫

తే. దేశవైశాల్య మర్థసిద్ధికిని మూల,
మిల యొకింతైన, గుంటకాల్వలు రచించి,
నయము పేదకు నరిఁ గోరునను నొసంగి,
ప్రబలఁజేసిన నర్థధర్మములు వెరుఁగు. ౨౩౬

తే. ప్రజ నవసి చన్నఁ బిలువ, కప్పనులఁ గొలుచు
నమ్మి, యిండ్లింధనంబుల కాయె, ననెడి
కలని నక్కైన యధికారిగల నృపతికి
నేడు దీవులు గొన్న సమృద్ధి లేదు. ౨౩౭

మహాస్రగ్ధర

ఉరవౌచాగంబు భోగం బుభయము నొకపా లుగ్రసేనావనార్థం
బిరుపాల్భండారుబండారిలు చొర నొకపా లిట్లుగా నాయ మొప్పం,

హావళ్ళన్ దిగఁ నన్యభూప్రజల రా జాయాయిజాత్యోచితిన్
బ్రోవంగాఁదగుఁ; దోఁట దొడ్డి గను లాప్తు ల్చూడఁ బంపం దగున్. ౨౪౫

ఆ. హదను వచ్చుదాఁక నవరాధిపై రోష
మాఁగి చెఱుపవలయు హదను వేచి,
లక్ష్యసిద్ధి దాఁక లావున శర మాఁగి
కాఁడ విడుచు నంపకాఁడువోలె. ౨౪౬

శా. పోషం బోలు లఘుప్రయాణత దినంబుల్గొన్ని, యొండొంట నే
కా వైరిక్షితి, కంబువు ల్వఱద రాఁగా నిల్చు జాలుంబలెం,
ద్రోవన్ సైన్యము గూడ; వైరి బలసాంద్రుం డైనఁ బూఁజాదులం
బోవం బోలుఁ, జరోక్తిచేత నసదేఁ బో కావరింపం దగున్. ౨౪౭

చ. ద్రవిణము నొవ్వఁ గొంట, నొఱ ద్రాబలతో నిడుచుంట, భూమి గొం
తవలికి విచ్చుచుంటఁ బ్రథమాప్తతఁ జూడక శంక నుంట, లోఁ
బొవయు నృపాళికై యభయము న్మణిభూషలు గుప్తిఁ బంపిఁ, భూ
ధవుఁ డరియం దిడం దగు భిదం, దనయం దివి మాన్పుకోఁ దగున్, ౨౪౮

క. అహితుఁడు వేఁడిన, నేలెడు
మహి సగమే నిచ్చి, తెగనిమైత్రి గొని, విభుం
డహితభయము మాన్పికోఁ దగు;.
నహితభయ మహీభయముకంటె నధికము గాదే. ౨౪౯

చ. పలుకులు వేయు నేమిటికిఁ? బార్థివుఁ డాత్మభుజాభృతక్షమా
తలమున [1] గుట్టుకీడు బహుధా యరయించి, యడంచి చంచలా
త్ములగమిలో మెలంగు పురుషుండును బోలె నశంక నించుచున్
మెలఁగఁడ యేని, రాజ్యఫలమే ఁ ది? రాజ్యము దుఃఖలబ్ధికే? ౨౫౦

తే. బెదరి చేరని బలియుని బిగియఁ బట్ట
కతనిమైవడినే వచ్చి హత్తఁ జేఁత
క్రమము, పెనఁగెడు బలుమీను ద్రాటఁ జేఁదు
నొడ్డుగాలంపువేటకాఁ డుపమ గాఁదె? ౨౫౧

---

[1] ఁగుట్టు పేడు.

సీ. దండపారుష్యంబు, కొండెంబున నతర్క,
మరిసంధి కెడయీక మరలఁబడుట,
యవలి తప్పెన్ని కన్న విదేశ్యుఁ జెఱచుట,
ప్రతిప్రవర్తకున కే ర్పడఁగఁ జేఁత,
జను నవిశ్వాసంబు గనుఁగొని మెలఁగుట,
విశ్వసనీయుని వేర్పఱచుట,
మోమోట మంత్రంబుచో మిక్కి లిడుకొంట,
మంత్రభేత్తకు నాజ్ఞ మఱచియుంట,

తే. వింత పుట్టినఁ గనుగల్గి చింత సేయ
కుంట, మాన్యులపట్టున నొక్క చూపె
చూడకుంట, విహీనులఁ గూడుకొంట,
వ్యసనియై యుంట, చలముంట, వలదు పతికి. ౨౫౨

క. త్రివిధోత్పాతము లొదవిన,
నవనివిభుఁడు విడువవలయు నధికద్రవ్యం
బవనీసురముఖ సురముఖ
పవనసఖముఖముల భుక్తిబలిహోమవిధిన్. ౨౫౩

ఉ. స్పర్ధ పరస్పరంబు దొరపట్టున యోధనిపట్టున న్నృపుల్
వర్ధన మొందఁ జేయఁ దగు: వారిహితాహితచర్య లొంద వం
తర్ధి; మిథోవ్యథావహ హిత ప్రథమానసమానతాప్రథా
ధూర్ధరతామునం దగిలి ద్రోహపుఁజింతఁ దలంప రేమియున్. ౨౫౪

[illegible] [illegible] డెందునేఁ దగదు తాఁ [illegible]న, నూఱట కొక్కనిం దగుం
[illegible] [illegible]రెంచి పంప. నరి దుర్బుచేఁ జెఱఁ, దాతఁ దర్థభూ
క[illegible]తు [illegible]ర్జ లేక కొఱగాఁ, డటు సేయ ద్విజాన్యుఁ డల్కకున్
నెరవ[illegible]. నాతఁడున్ వలయు, నిండినదుర్గబలోర్వి యీఁ దగున్. ౨౫౫

క. అనవు[illegible] గడి దేశములవి
దడము [illegible]గాఁ బెంపు; మాత్మ ధరణీస్థలికిన్
నడుము [illegible] పొళ్ళుపొళ్ళు గఁ
బొడివి [illegible]ము దస్యుబాధ పొందక యుండన్. ౨౫౬

చ. క్షమఁ గుఱుమన్నెపుం గహనచారి జనంబెడ దోషదృష్టి కు
ద్యము గడుగంగఁ బూన్కి; దెగ దల్గిన సర్వము: బాస పీగి వ
శ్యముగ నొనర్చు దాడి కగు: నౌ గడి కొల్లలకు; న్మతాపరా
ధమును సహస్రదండము నతర్క్యము సర్వము నేలువానికిన్. ౨౫౭

తే. సింధుర మహాశ్వముఖ్యము ల్చేర్చు దౌలఁ
దీవి వణిజుల కూళ్లు సద్గృహములు పురిఁ
గొలువుఁ దేజంబు వెల మేలు గలుగఁ బ్రాఁత
వారిగాఁ జేయు, నరి నవి చేరకుండ. ౨౫౮

తే. గడి నృపులరాయబారులయెడఁ గొలువున
సరసల్లాపములు రాజు సలుపవలయుఁ;
గార్యఖడ్గము లనుచరు ల్గానఁ బలుక
వలయు; నవి మైత్త్రిఁ దాఁ దేలఁ బలుకవలయు. ౨౫౯

తే. తా నవంబుగ దొరఁజేయువాని మంత్ర
మునకు వేగమె లోఁజేయఁ జనదు; వాఁడు
క్రొత్తమన్నన రహి ననుఁగులకుఁ జెప్ప,
నయిన నదిచేదు, మఱి వాఁడు నడఁగుఁ గాన. ౨౬౦

సీ. హితబహుశ్రుతధర్మరతశూరతాన్వపూ
ర్వతల మన్ద్వీజుల దుర్గముల నిలిపి,
పులిఋన్ను మొదలుగాఁ బురుషాయుషావధి
కం దుంత నవరణ ల్పొందుపఱిచి,
హేమంత యైనను సామంతకోటికి
మితము దప్పక యుండ క్షితు లొసంగి,
య్యాయాధికవ్యయా నధికంబుసుం బ్రజా
విరుజంబుఁ గాఁగ బందరువుఁ గూర్చి.

తే. క్షితిరిపుధాత్రిఁ జరదృష్టి చేతఁ జూచి,
బకహరగతిఁ గ్రహించి, తాఁ బ్రజయు నొవ్వ
కయ వగఱగాత్రములనె చీకాకుపఱచు
నృపతి డెందానఁ జేయిడి నిద్రవోవు. ౨౬౧

క. ఎచ్చో గజఘోటక్రియ
తచ్చర్వణసుభటజీవితద్విజసురపూ
జోచ్చనిజభోగముల కగు
వెచ్చము వెచ్చంబుగాదు విత్తంబునకున్. ౨౬౨

ఆ. ప్రతిన వాసి వైరిపట్టున నృపతికి,
దంతువెతలఁ దీఱకుండుఁ దీఱుఁ;
గాక యుండియుండి కాలాంతరమున నొఁ;
గార్యకాఁడొ యంతకాఁడొ నృపుఁడు. ౨౬౩

క. పోరానిపట్లఁ బొడుచుట
వైరిబలము దిరుగ జయమొ స్వర్గమొ యగు; నా
నారూపయంత్రతత్స్రీ
కారాదులపట్లఁ బ్రజనె కవియింప నగున్. ౨౬౪

చ. మనమున కొండు రెండు మఱుమంత్రముల న్సరిపోవఁ జెప్పినం
జనపతు లాతనిం బిలువ సాగదు: రాగతి సారెఁ బిల్చిన
చ్చనవునకే ధనాదిఁ గొని సంగతి గానివి క్రొవ్వి చేయఁ జె
ప్పు: నృపతి దద్విహిశ్చరితముం జరుచేఁ బరికింపఁగా దగున్. ౨౬౫

క. గడివాఁడు చెడునయేఁ దగుఁ
జెడఁ జేయుట; చెడఁడయేని చెల్మియె తగుఁ; బై
గడివాఁడే పనికగుఁ దన
గడి వాఁ డరియైనఁ, దనకె గడి కావఁబడున్. ౨౬౬

తే. రాష్ట్రి మెరియింపు, కొనుము దుర్గములు, తదవ
రోధ మగపడ్డఁ బుట్టింటిరూఢి నెరపు,
వరుసములు తద్రిపులరాయబారు లెదుటఁ
బలుకకుము, సంధి యొకవేళ వలసియుండు. ౨౬౭

ఆ. అభిచారి ఘనగరాంబుదూషితరుజ్ని
రంతరాద్రిగహనదంతురోగ్ర
కీకటోర్వి మేరుగిరిసమార్థము వచ్చు
వేనిఁ జొరకు, వంపె యిఱుము కొనఁగ. ౨౬౮

క. రాణింపఁ బలి తనపని
జాణై కొనుఁ. గొలుచు సంతసపుఁదఱిఁ, దొలఁగుం
బ్రాణ చెడఁ గవుడుమానిసి:
నాణె మెఱుఁగ బచ్చ గాఁగ నరపతికిఁ దగున్. ౨౬౯

సీ. తజ్జ్ఞమండలిఁ గూర్చి, ధాతువుల్ దెలిసి, హే
మాదులఁ గొని, ప్రకృత్యనుగుణాల్ప
జీవనాహృతులచేఁ జెలఁగి, మహాబలో
ద్రేకంబు మర్దన రిత్తఁజేసి,
స్నేహార్ద్రుఁ డగుచు నశేషంబుఁ బోషించి,
నరవర్గములతప్పుసరణు లుడివి,
సతతద్విజప్రతిష్ఠాశాలియై బలి
యించువట్టులు బలియించి, పలుచఁ

తే. జేయుపట్టులు పలుచఁగా జేసి తేజ
మెసఁగ శోధన మఱవక యెసఁగ వలయు
సాంగరాజ్య మొకెత్తుగ స్వాంగరాజ్య
మొక్కయెత్తుగ నృపతి యాయుష్యపరత. ౨౭౦

సీ. సౌఖశాయనిక భిషక్పూర్వకము కల్య,
వేళఁ గార్తాంతిక ద్విజుల గోష్ఠి,
జాము వోవ నమాత్య సామంతపూర్వకం
బర్థార్జనస్థకాయస్థగోష్ఠి.
దినమధ్యమమున మర్దనమల్లపూర్వకం
బగు సూదసూపకృన్మృగయుగోష్ఠి.
యపరాహ్ణమున దేవతార్చనాపూర్వకం
బార్యధర్మాధికృద్ద్యతులగోష్ఠి,

తే. భుక్తిపీఁఠ విదూషక పూర్వకము పు
రాణకవిగోష్ఠి. చారపూర్వకము సంజ
జాము గాయకగోష్ఠి, నిశన్ సుషుప్తి
పూర్వకము ప్రేయసీగోష్ఠి పొసఁగుఁ బతికి. ౨౭౧

క. హితులు హితాహితులు సదా
హితులునునై రాజునెడల నిటు త్రివిధమునన్
క్షితి ననుచరు లుందురో సం
తతమున్; మఱి వారిఁ దెల్పెదన్ విను మనఘా. ౨౨౨

చ. హితులు భిషగ్గ్రహజ్ఞబుధబృంద కవీంద్రపురోహితు ల్హితా
హితులు ధనార్జనాదినృపకృత్యనియుక్తులు వెండి కేవలా
హితులు దశావశాప్పితసమృద్ధిరమాహరణేచ్ఛు; లౌట నా
హితమును నట్లు కాఁ జతుర వృత్తిఁ జరించుట నీతి జేనికిన్. ౨౨౩

ఆ. పాత్రభూతు లెన్న బరికించి. యతఁడు
గకయు నొకఁడు నెప్పకయు మునుపుగఁ
ఒనసవండ్లు దిగిన పరిగ, స్వప్నము గన్న
నెఱిగ, నొసఁగి వెఱఁగుపఱుచు టొప్పు. ౨౨౪

క. పితృదేవక్రియలను విధిఁ
బితృక్రియలె సూక్ష్మ లగుటఁ పితృభక్తుఁడ వై
శ్రుతిశీలతపశ్శాంతా
చ్యుతభక్తుల కొసఁగి పనుపు మున్నతగతికిన్. ౨౨౫

క. దానము ద్విజరక్షణకును
జ్ఞానము నిజరక్షణకుఁగ శరణము చొరు మెం
తే నారాయణు:'రాజ్యా
న్తే నరకం ధ్రువ' మటంచు దీఱునె యొంటన్. ౨౨౬

తే. అలిపతిభక్తి, స్త్రీపుంసపాళి వావి,
యతి వశిత్వము, దిగఁబాతు లగ్రజాతి
ననుసరించుట, హితవృత్తి నధిపునికి
భృత్యుఁ డొదవుట, నృపదండభీతిఁ జుమ్ము. ౨౨౭

ఆ. చంపి ధార్మికుండు, సతిఁ బొందు మఱి బ్రహ్మ
చారి, బొంకి సత్యశాలి, యార
గించి సదుపవాసి, కేడించి శూరుఁడు,
చిందె ధనియు, నగు విచిత్రసరణి. ౨౨౮

ఆ. ప్రణిధి స్వపురగృహీయు, భాషావిదుఁడుఁ బ్రణి
ధ్యంతరావిదుండు నగు ; నతండు
లింగమాత్రకృతుఁడు లిప్సాతిగ ద్రవ్య
ధానధనియుఁ గాక తిఱియఁ జొరఁడు. ౨౭౯

క. తనుభృత దమనజ సుకృతము
ధనద త్తిన కొనఁగవలయుఁ ద త్తదృతుకమ
ర్దన మజ్జన భోజన లే
పన వసన ప్రసవవహన వరతం బతికిన్. ౨౮౦

క. నానావిధషాడబముల
నాను నృపాహార మెపుడు, నవరాజ్ఞమునం
గాని మఱి శుద్ధకోష్ఠతఁ
గాని తమి న్భుక్తియెపుడుఁ గడుఁ బథ్యమగున్. ౨౮౧

క. విను, వర్గసమత నృపుఁ డు
న్నను, ధర్మాంశంబె హెచ్చెనా, శుభమది కె
త్తినసీరను దెగి యలరా
జనపుమడికి నెక్కినట్లు చను ముద మందన్. ౨౮౨

క. వెలయించు నట్టి యొకమణి
వెలుఁ గానం గొనుము, ధరణి వెండి నువేషో
జ్జ్వలతకు వలదే వాసర
ముల మణులవిభూషణములు భూపతి దాల్పన్ ? ౨౮౩

క. చేయునది రాజ్యమంట, యశ
మే యవధిగ సీఁగువార మే, మనఁ జన ; దా
మ్నాయంబు సశక్యాను
ష్ఠేయముఁ జెప్పదు ; స్వశక్తిఁ జేయఁగఁ జెప్పున్. ౨౮౪

వ. మనుదండధరాదులు విశేషించి దోషం బెఱింగి దండించియె ధర్మ్యనరు లన్నఁ బరఁగిరి; ప్రజాపాలనంబు పనిగాఁ బ్రజానాథుండు బహుముఖంబులం బుట్టిం పం బుట్టి విరాట్స్వరాట్ప్రభృతి వేదోదితశబ్దవాచ్యం డై దేవసదృశుం డగు మూర్ధాభిషిక్తుఁడు సోఁకోర్చి యిలకు నగునలజళ్ళు తీర్చినంగాక జన్మంబు నఫ

లం బగునె; కేవలేంద్రియప్రీతి బందీకృత పరకళత్ర పథికపరిషత్పరిహరణ ప్రాప్తపవిత్రమ్ములఁ బాటచ్చర ప్రభులకు జెల్లగదే? యింత లాంపట్య మేమి పని యని యవనియెల్ల నవన వైముఖ్యంబు చెల్ల; దెట్లనినఁ దొల్లి కృత యుగంబునఁ గృతవీర్యనందనుండగు సహస్రబాహుం డాత్మీయదోస్సంభ సంభృత యగు నీవిశ్వంభర నేక్ష్వేపంబున నేనాఁట నేపేట నేత్రోవ నేక్రేవ నేవేళ నెవ్వఁ డేమి సేయం దలంచు నప్పు డందుఁ దు నని ముసల చాపాది శస్త్రాస్త్రధారియై తోఁచి యాజ్ఞ యిడుఁ; నట్లాజ్ఞ యిడ నంతిమం బగు నీయుగంబున యుగానుసారంబుగా మితసారం బగు రాజలోకంబునకు శక్యంబుగాదు గదా? యొక్క రాజలోకంబున కన నేల? యిక్కాలంబునందలి భూసురులకు నక్కాలంబునందలి భూమిదివిజులకుఁ గల శక్తి యున్నదె? యొక్క బాడబుండు కడలినీరు గ్రుక్కఁ గొనియె, నొక్కవిప్రుఁడు స్రష్టసృష్టికిఁ బ్రతిస్రష్ట యయ్యె, నొక్క బ్రాహ్మణుండు బ్రహ్మదండంబున బ్రహ్మాస్త్రంబు వారించె, నట్టియనుష్ఠానంబు మాకు లేదిందేమి ప్రయోజనం, బని శక్యానుష్ఠానంబు పేరికి విడువవచ్చునే? వీరితరుల కుపాసనీయులు గాకపోయిరె? కావున సావధానుండవై శక్తికొలఁది శ్రుతదృష్టంబు లుపేక్షింపక రక్షణశిక్షణంబు లాచరించుచు నశక్యంబున కార్తశరణాగతరక్షకుం డగు పుండరీకాక్షుమీఁద భారం బిడి యనహంకృతిఁ బ్రవర్తిల్ల నెల్ల సంసిద్ధులు కరస్థంబులగు. నది యట్లుండె, నట్లయిన పట్టబద్ధుండగు రాజు ధర్మంబునందు దృష్టి యిడి నడవవలయు; వరుణ వైశ్రవణ వాయు వైశ్వానర వాసవాదుల జన్మంబులును బహుళభవాబ్ధక్రియాలబ్ధంబుల భూర్భువస్స్వరామలగు నిజ్జగంబులును ధర్మప్రతిష్ఠితంబులు కావునఁ దదాచరణచణుండవై ఋణత్రయంబును నీఁగి సమానుఁడం ధుత్తమ శ్లోకుండవై రాజ్యపరిపాలనంబు సేయు మని యభిషిక్తుం జేసె. నిది మదీయ భక్తిప్రభావం" బని యంబుజాలయ కానతిచ్చె. ౨౮౪

## ఆశ్వాసాంతము

శా. దుగ్ధాంభోధిమహాగృహోత్సుక, సుధాంధోబృందచూడామణీ
రుగ్ధారాశబలీకృతాంఘ్రియుగ, కారుణ్యాంబునిర్ధూతభవ
ద్రుగ్గ్రాహా, ధృతమంథ, సింధురవరార్తిచ్ఛేదిదోశ్చక్ర, శ్రీ
ముగ్ధాలాపరసాదరా, కృతవలాన్మూర్ఛన్వనోద్యద్ధరా ౨౮౫

క. కరధృతదరారివితరణ
పరిపాలిత తొండమాన్నృపాలక, పునరు
త్తరిత నరసన్నృబాలక,
శరణాగతసేవధీ, భుజంగాశరధీ. ౨౮౭

మత్తకోకిల

కుండలిద్విషదగ్రకేతన, గోత్రభిద్ద్రుమహారి దో
శ్చండిమోత్పులకీకృతాంగకసత్య, దైత్యకురూక్షవా
క్చండితత్వ, యశోవిధీకృతపాండవేయ, కపర్దికో
దండఖండనపాటవాంచదుదారదారసమాగమా. ౨౮౮

శా. ఇది సింహాచలపంభకేసరిపదాభీష్టార్చనాపుణ్యల
బ్ధదురుట్టంకణ పొట్టునూరివిజయస్తంభోపలోట్టంకితాం
కదృఢేష్టాక్షర కృష్ణరాయనృపసంజ్ఞాన్మకృతాముక్తమా
ల్యద నాశ్వాసవరంబు నాలవది హృద్యంబై మహిం బొల్పగున్. ౨౮౯

చతుర్థాశ్వాసము సమాప్తము

శ్రీరస్తు

# ఆముక్తమాల్యద

## పంచమాశ్వాసము

శ్రీసీతా జాంబవతీ
మానస తామరస విహరమాణ మిళిందా
భా సద్యుదయ కళిందా
నానాంధ్రమిళిరోక్ష శేష నగ హర్యక్షా. ౧

వ. అవధరింపు మవిశిష్టచిత్తుండ. ౨

మహాస్రగ్ధర

ఒకనాఁ డా బ్రహ్మాంకు రౌఘం బురు కుసుమకుతం గోదరక్షోణిఁ దల్ప
ప్రకరం బై కాంక్షచే మున్నతుఁ బదరి పైఁబ్రౌఢి వాటించి నిట్టూ
ర్పొకదొట్టఁగా దన్నిపీఠాయిత మటి మటి తా రెట్లు మున్నట్ల యౌనా
యఁకలం గందర్పుఁ దోఁటం బెటిఁగి తటిమి పీఁ పేసెనా నంటు తోఁటన్. ౩

గోదాదేవి

ఉ. వింగడ మైన యొక్క వనవీథిఁ గనుంగొనె సీత సున్నపున్
రంగుటరంగు పచ్చలయరం గయిపో వెలిదమ్మి బావికిం
జెంగట నుల్లసిల్లు తులసీ వన సీమ శుభాంగి యొక్క బా
లం గిరువింద కందళ దళ ప్రతిమాంఘ్రికరోదరాధరన్. ౪

చ. కనుఁగొని విస్మయం బొదవఁగాఁ గదియం జని సౌకుమార్యమున్
దనురుచియు న్సులక్షణ వితానముఁ దేజముఁ జెల్వుఁ గాంత నే
వనిమిష దృష్టిఁ జూచి యహహా? యనవత్స్యన కమ్మకుండఁ దే
లినయఁగ నాకు నీశిశువుఁ ద్రాఁ గృష నేసె నటించు హృష్టఁ డై. ౫

క. కొనిపోయి ధర్మగేహిని
కనురక్తి నొనంగఁ బొంగి యాయమయును జేఁ
వు నిజసన్న్యంబున లిఁ
బెనిచె న్గో మెప్ప నిట్లు పెరుఁగఁ గ్రమమునన్. ౬

సీ. వాతెఱ తొండికై వడి మాటలాడదు,
కుటిలవృత్తి వహించెఁ గుంతలములు
అక్షులు సిరులు రా నలుగంటఁ గనుఁగొనె,
నాడించె బొమగొని యాననంబు,
ననగొమ ల్నిగయ వక్షము పేక్షఁ గడకొత్తెఁ.
జాణిపాదము లెట్టవాఱఁ దొడఁగె,
సారెకు మధ్యంబు దారిద్ర్యముల చెప్పె,
తొ చ్చొర్వ కిటు లోఁగఁ జొచ్చె మేను,

తే. వట్టిగాంభీర్య మొక్కఁడు పెట్టుకొనియె,
నాభి, నానాఁటి కీగతి నాఁటి ప్రియము
చవుకయైనట్టి యిచ్చటఁ జనదు నిలువ,
ననుచు జాఱినకరణి బాల్యంబు జాఱె. ౭

శా. హేమాభాంగ విభావరారుణిమవక్త్రేంద్రు ప్రభాశీలఁ ద
ద్భామారత్నము పొంద దయ్యె మును దత్తద్వణా యుక్తాఖ్యలన్,
శ్యామాంకం బళి గర్వధూర్వహకచ చ్ఛాయాచ్ఛటం గాంచెఁ నౌఁ
గా మున్నుర్వి 'శిరఃప్రధాన' మను వాక్యం బెమ్మెయిం దప్పునే. ౮

క. ఆయత భుజైక చక్రుం
డా యదుపతి దొమ్మి గెలువ నతచు మరుని కా
లాయసచక్రపరంపర
లోయన నుంగరపుఁగురులు యువతికి నమరున్. ౯

తే. సకలసీమంతినీలోక సమతిశాయి
భాగ్యవర్ణాపకులు వ్రాసెఁ బద్మగర్భుఁ
డనఁగఁ గర్పూరతిలక రజోవదాత
ఫాలమునఁ గుంతలశ్రేణి పఙ్క్తి క్రాలు, ౧౦

శా. సైరంధ్రుల్ ప్రియికెత్తి కజ్జలముఁ బక్ష్మశ్రేణికం దీర్చ వా
లారుం గన్నుల మీఁదు చూచు తఱి ఫాలాంచ చ్చతుర్థీనిశా
స్ఫారేందుం గనె వక్త్రి; మక్కునట గాఁ బర్వేందుఁ డాత్మ ప్రభో
చోరుం డుండఁగఁ దన్నుఁ దద్గతవిభా చోరం బనున్ లోకముల్. ౧౧

చ. కనుఁగవఁ దన్నుఁ గెల్వఁగ మృగం, బల సూతున కిందురేఁతు నే
నని రుచిదక్కఁ దత్పరిమళాఢ్యత లేమి నతండు గొంకఁ, దా
వినుపఁ జనన్ 'బగం'దనదు నెత్తుటఁ బొట్టిడుకొంట కాక వా
నను ?' యనన్మృగం బమరుఁ జానకు ఫాలము పచ్చికస్తురిన్. ౧౨

తే. కడిఁదివిలు చేఁది గుఱి కీలకఱచి నిలుపు
మరునికువలయశరముకంపములఁ బోలుఁ
దార కడకంటిపై సారె చేరిచేరి
వేగ మగుడ సలజ్జ దృగ్విభ్రమములు. ౧౩

తే. నవ వయస్సీధు మదముచే శ్రవణ కూప
ములఁ బడెడు శంక నలువ చాపలము లుడుగ
విడియె శృంఖల లనఁ గాటు కెడిన దీర్ఘ
పక్ష్మరేఖలఁ గనుదోయి పడఁతి కొనరు, ౧౪

చ. అనయము రాగ మొప్ప నహాశాననచంద్ర కటాక్ష పంక్తి వ
ర్తన నపు శంకఁ గణ్మ మను శ్రీ మఱుపెట్టుఁ జెఱంగి చెండుఁ గొ
ట్ట నవనిఁ బడ్డ కమ్మ మగుడం గొను నంతకు నంసపాళి నం
గన యిడి దాఁచు పేరఁ బెర కర్ణము కమ్మ పయిం దళుక్కనన్. ౧౫

శా. నాసా చంపకత న్సుగంధ మచటన్ రా భృంగముల్ గ్రోల నం
త్రానం బొందియుఁ, బల్కుచో నలము వక్త్రం బేల నా నేటి ? కం
దే సౌరభ్యము లేమ. కుందములు గావే దంతము ? ల్గానినాఁ
డాన క్కిన్ బ్రతిబింబ దంభమున నే లా వ్రాలఁ దజ్జాతికిన్ ? ౧౬

తే. శంఖ సామ్యంబు రా మున్ను జలజభవుఁడు
సరసిరుహపత్త్రనేత్ర కంధర యొనర్చె,
జవ్వనము వచ్చి వెండి సాక్షాత్కరించు
శంఖమున చేసె నును గంధసారచర్చ. ౧౭

క. కమలదళేక్షణ సంగీ
తమునఁ దెగడు మంద్ర మధ్య తార త్రిస్థా
నములకుఁ దీర్చిన రేఖల
క్రమ మగు రేఖాత్రయమునఁ గంఠం బమరున్. ౧౮

తే. లలన మృదుబాహు యుగబిసలతలు గడఁగి
బిసలతాశ్రీల నెల్లను వెస హరించె,
మఱి హరింపంగ నవి నెఱి విఱిగి కాదె
సారెఁ దనుయాత్రఁ దంతులఁ జరపుచుండు. ౧౯

మ. తళుకొత్తు న్భుజకీర్తి వజ్రఘృణి సూత్ర స్యూత హారస్ఫుర
త్కళికా చిత్ర కుచద్వయోపరి గళాధస్స్వల్పవిస్తారమై
వ్యాళికాలస త్తిర్యగుర స్స్థలం బను వివాహాంభ న్మనోజాత పా
టలవృంతచ్ఛదపీఠబావికముదంచ ల్లోవలెఁ గేళ్లింతికిన్. ౨౦

చ. ఒరవెడు జవ్వనంబు వెలికొత్తఁగఁ, బయ్యెద నిగ్గుఁ గూడి బి
ట్టదుమఁగ, లేఁత లౌట దిగ నాఁకను మీఱను లేక, వక్షపుం
జదుమునఁ బ్రక్కలి న్మెఱసి చప్పటలై మఱి లావు గూడఁ బైఁ
[1]బొదలె ననంగఁ బిక్కటిలెఁ బొల్తుకచన్నులు నాఁడునాఁటికిన్. ౨౧

తే. ధృత రఘూత్తమ శాప మొక్కింత విడిచి
విడిచి కద కేఁగ నవ్వు దప్పుడ కలిపెడు
చక్ర యుగ మన బొమ్మెర్ల న్నాక్రమించెఁ
గొమిరె చన్నులు లేఁగవ్వు కొనల నలర. ౨౨

క. తా రెట్లట్లుగఁ దమ్ముం
జేరిన ముత్తెంపు సరులఁ జేసియ చన్నుల్,
లోరెంట నుడిపె. ఘన మగు
వారు నిజార్ణవముఁ జేరువారికి నీరే ? ౨౩

తే. విరహితతిమీఁదఁ గోపాన మరుఁడు దివియ
వేగమై పైఁడి యొఱతోన వినరఁ, గట్టు

1 పా. పొదివె.

దునిసి బ్రతికి నసిధార దోఁచె ననఁగఁ
కనకరుచి మధ్యలత నారు కాంత కలరు. ౨౪

క. అండజ గామిని యూరువుఁ
బిండువలపు లాన నాభిబిలము వెడలి చ
న్గొంతల నడుముగఁ బ్రాకెడు
కుండలియో యనఁగ నారు కొమరొప్పారున్. ౨౫

క. అంగన నిలిచిన బాహువు
లుం గొనును నేఁబుపలుచు లోకమునకు ర
క్తాంగద కాంచీభేదము
లుం గెళవుల నడుమ నునికియు న్బూఁగారున్. ౨౬

క. తనుమధ్య వళీభంగము
లనుగూర్పఁగ నవియుఁ దత్కులముల యఁ ఁ గం
తుని యిడినపత్రితే కనఁ
జను నొడ్డాణమునఁ గొను చామకు నమరున్. ౨౭

క. లేఁ గౌఁ దీఁగ నితంబము
వ్రేగునఁ ద్రెంపుటయుఁ గని విరించి బిగించన్
లోఁగి ముడి యిడియె వదలుగ
నాఁ గోకస్తని గభీర నాభి చెలంగున్. ౨౮

క. వెలఁది కటిపేర నిల నొక
పులినము దిగఁబడియె సింధు పులినపు పంక్తిన్
నలువ యది వడఁగఁగాదే
తెలియుటకుం దంచపదము దిరముగ నిలిపెన్. ౨౯

తే. కదళి దివియించె నాగ్రాంఘ్రికంబు తొడల
వెనుపు నెట్టన్నఁ బొరల సోదన నడంచు
కొన్న యాఁదోఁకపాటును గొప్పు విప్పు
మెఱయు గోర్మ్రిచ్చులును గెంపు గుఱులు గావె. ౩౦

తే. వసుధలో నెట్టి శ్రీ గల వారివేని
కరభములు దాన్యములు సేయు సరసిజాక్షి

యూరువుల కెట్ల ఓన్నఁ బైఁ దారు మోచు
గొడుగులును నల్ల కలశముల్ గుబ్బలు గావె. ౩౧

క. వలరాజు కుటుంబము న
గ్గలముగఁ బోషించు కలమ గర్భము లయ్యెన్
బొలఁతుక జంఘ లతిశ్యా
మల మంజీరస్థ నిబిడ మరకతకాంతిన్. ౩౨

తే. ఉదిత నిద్రంపుజంఘల సవతుఁగోరి
కలమగర్భంబు లడఁచు లోఁ గంటకములు,
దాతురుల మించి మఱి దివసక్రమమున
నిలువ కవి బాహిరము లైనఁ దలలు వంచు. ౩౩

చ. ఇలఁగల వస్తుసంతతుల కెల్లను గచ్చడు మాన్యభావ పా
టల రుచి కేమొ వేఱ యొక డా లిఁక వచ్చునె? లక్కనీట మ
మ్మలమిన దెంత ముగ్ధ యిది యంచుఁ బదాబ్జము లంగుళీముఖం
బుల నగు నట్లు మించునఖము ల్మెఱయన్ గొమరారు నింతికిన్. ౩౪

క. లలనోపరిపద కచ్ఛప
ములు బలిమిమెయిన్ గజ ప్రభూతగతి శ్రీ
విలసనముఁ గొనఁగఁగాదే
కలిగెన్ గజకచ్ఛపోగ్ర కలహం బుర్విన్. ౩౫

తే. తరుణి తనుకాంతియెదుట నూతనహరిద్రి
తులకు రాలేక యత్యంత మలిన యయ్యె;
నౌటఁగా రాత్రియన నిశ యనఁ దమిస్ర
యన నిశీథిని యన క్షప యనఁగఁబరగె. ౩౬

సీ. అయ్యిందువదన ధరాంగన గావునఁ
బ్రాజ్ఞేమ్రిఁ బొరుగుల భాగవతుల
గృహములందు మరాళికై కావళీ హరి
ణీ మనోజ్ఞా స్రగ్విణీనమాఖ్య
లమర ఒనించి వయస్యలై నాగక
న్యలు పుత్త్రికావివాహముల్గయ్యందుఁ

బాడు పద్మాలయా వరిణయామేయగే
యముల ననంతు కల్యాణగుణము,

తే. లద్భుతం బొప్ప విని విని యతనిఁ గవయు
బుద్ధి ప్రాగ్జన్మ సంస్కారమున జనింపఁ
దదవతారానుమేయ కథాసుధాను
కలిత లీలానుకృతుల వర్తిలుచు నుండి. ౩౭

సీ. తమతండ్రి శ్రీశ దత్తశ్రీలు గృహమునఁ
ద్రవ్వితంతములయ్యెఁ దనదు తొంటి
స గ్వినిర్మాణ దాస్యం బనుత్సేకత
జరపుచుఁ బ్రజ్ఞ వైష్ణవపురాణ
సంహితావ్యాఖ్యా రచనఁ బ్రొద్దుఁ గడుపుచుఁ
గట్టెడుకమ్మ చెంగలువ విరుల
తోమాలె లలకలు దువ్వి కంతునకు [1] బా
ర్థనిబద్ధఖేటకం బనఁగ సీల

తే. వృషకకుద్రేఖ నెడమ కొక్కింత యొఱగ
నిడిన ధమ్మిల్ల వలయంబు నడుగనందుఁ
గొంతనే పర్థిఁ గీలించి కూపవారి
నీడ వీక్షించి క్రమ్మఱ గూడ నునుచు. ౩౮

ఉ. ఆ నవలా యలంతి పసుపాడి, దుకూలముఁ దాల్చి, యువ్విదల్
గోనలఁ దావు లుప్పతిలఁ గంకుమ తేటల నిగ్గు దేరఁగ
స్రానన నాభిఁ దీర్చి, వితృ బద్ధ లతాంతము లర్థిఁ గొప్పునన్
బూని యొకింత సేపునిచి పుచ్చి చెలిం గని వెచ్చ నూర్చుచున్. ౩౯

క. మీ పాడిన హరిచందము
లే పాడిగఁ దలఁప వచ్చు? నితఁ దేవతులం
గాపాడినవాఁ డనఁగ్రై
క్రొ పాడినఁ దన్ను వలచి, తొయ్యలులారా! ౪౦

---

[1] కూర్పరబద్ధఖేటకం

తే. తాను సురమౌని నృపతనుల్ దాల్చె యకట
కామినీరతి నుడికించుకంటె నట్టి
గండెయును నల్లదానరిగాఁడు కిరియు
హరియు నై పోవుటయ మంచి దనుయుగంబు. ౪౧

క. ఆ తనువుల లేరు గదా
నాతులు; మఱి కాక కలిగిన, న్వగఁ దిర్య
గ్జాతికి నీజాతికిఁ గల
యాతీవ్రత గలదె? ఘొఱుఁగ కి ట్లేలంటిన్ ? ౪౨

తే. "ఆత్మవ త్సర్వభూతాని" యనుట బొంకె?
ముద్దియల కైన వలవంత ముచ్చటఁను
నాట పాటలఁగతలఁ గొంత తఱఁగుఁ గాని
నోరు లేని జంతువులకె నొప్పి ఘనము. ౪౩

మ. ధరపై సీతఁడు పూర్వకల్పముల సక్తస్త్రీపిశాలాంబకాం
బురుహశ్రేణి జలంబు మైఁ బులకలున్ బూరించుచున్ వేఁచు దు
ర్భరకర్మం బలమంగ వచ్చు జలజత్వ స్తబ్ధరోమత్వకే
సరిత ల్పూర్వ్యవతార దంభమున నాచ్ఛాదించుఁ దా ప్రౌఢిమై. ౪౪

క. అనిమిష ముని మనుజాధిప
జననంబుల సీతఁ డెట్లు జలజాక్షులఁ గూ
ర్చిన వారి నేఁచె దయలే
కనిన విసుఁడు మీదుపాటు లంద తెలిపెదన్. ౪౫

చ. మొదల సుషేంద్రుఁడై యితఁడు మోఘహతిన్ భృగుపత్నిఁ ద్రుంచి, య
మ్ముదుసలి 'గేహినీ విరహముం దన యట్లన పొందు' మన్న, నా
కవియును దేవకార్యమున కయ్యెడు నంచు వహించి, త్రోఁచు లా
గెద వటువయ్యు లచ్చి మది కెన్నఁడుఁ బాయని జాలి నింపఁడే? ౪౬

మ. ప్రళయార్కోగ్ర కురార కోటము నృపత్రైవిద్యవత్పీఠికా
ఖ్యల త్రిస్థానము లేడుమార్లు వరుసన్ ఘట్టించు దోశ్శక్తిఁ గీ
ర్తిలసద్వల్లకీ ప్రోయ రక్తయయి యెంతే వశ్యయౌ భూ సతీ
తిలకంబుం దుదిఁ ద్రోపఁ గశ్యపున కార్తిం బిడ్డ యైపోవదే? ౪౭

మ. తన సౌందర్యము చెప్పఁగాఁ గరఁగి పద్మాకాంత రప్పించి మో
హనకంజంబున వైచి తియ్య మిడు నెయ్యం బొప్పఁ బైకొన్న, మీ
ఁతి నృశంసత్వమునం బొలంగి, వసి వెట్టిం జేసెఁ, గాకుత్స్థుఁ డై
న నిలింపారివిదారిచందమున లెం దానస్విచారింపుఁడా. ౪౮

చ. చెలువముఁ దాల్చి త న్గవయఁ జేరిన రాగిణి రావణస్వసన్
నలువురు నవ్వ నత్తెఱఁ గొనర్పక యేలిన, వియ్య మై యతం
డలుగఁడ, సీత కిట్టి తలఁ పాత్మఁ దలంపక యాయమ న్స్వపృథా
కలహమునం దనం దొలఁగు కాకకు నాఁకకు లోను సేయఁడే. ౪౯

శా. శీత్కార ప్రసవద్రసమై పెదవి గం పింప, న్మ్రల క్షిప్త ప్రా
వృట్కాలాంబుద గర్జ గెల్వఁగ. వల, స్పృశ్యఖండశాఖాసిత
త్విట్కుంభీనసరేఖఁ గే లసిలతా ధృద్బాపల వేష్టింప, ము
రాట్కంఠీరవ మై యొనర్చె పడి సోణా, లంట ఘోణాచ్ఛిదన్. ౫౦

తే. ఒల్లఁ బొమ్మన్నఁ బోదె, తా నుల్లసముల
నేఁప? నది రక్కసియయౌట యెగ్గె? పలచి
స్త్రీలు దలవంపఁ దాన వచ్చె, నది చాల
కాటదాని జీతు సే యఁగవలయునె ? ౫౧

మ. తను నంటన్ నతు లొంచఁ గోరు మునివృందంబుం దదాపోవి వ
ద్వనజక్షోదము గల్గియు, న్వెలజనిం దా వల్లవ స్త్రీలుగా
జననం బందఁగఁ జేసి కూడియు, న్వసంసక్తాత్ములం గాందినీ
తనయప్రేరణఁ బాసె భోజపుర యాత్రాదంభ సంరంభి యై. ౫౨

చ. హతలనొనర్చె మోహితల నల్ల యయోముఖి న్నావృల్ల స్వ్యభూ
సుతను, విరూప లౌట నసుచో, మునలి స్వేష్ట నిట్ట త్రాటి మై
యతివ రమించెఁ దా. మునలి య్యయ్య, రక్షా న్మఱుగుజ్జు ప్రేష్యకై
ధృతిసెడి యుగ్రసేనునకుఁ బ్రేష్యత నొందియు బిడ్డ యేలఁడే ? ౫౩

తే. తనకు నందఱుఁ గూర్ప బృందావనమున,
నొకతె రతిఁ దేల్చి, కాఁక నొం దొకతెఁ బ్రేల్చి,
యంత రాధకు మేలువాఁడై మురారి
యెల్ల నతులకు నెద నుడు కే యిడండె. ౫౪

వ. అని యిట్లు త్రపాభరంబున సుపాలంభదంభంబుగాఁ జేయు పునఃపునస్స్మరణంబున నంతఃకరణరాగంబు దేటపడం దెలిసి బోటు లీబోటి కైటభారియెడ నాటుకొన్న కన్నెకూర్మి లజ్జా వశంవదయై వెలివిరియంగానీక పుటపాక నికాశం బగుటఁ జీకాకుపడి నాఁడునాఁటికి నగుచున్నట్లు గిటగిటనగుచున్న దింత నియ్యింతి యెరవు మాన్పి మనలను గుట్టెఱుంగనీయని యింగితం జెయుట వలుచుకొని చింతావనోదనంబు సేయకున్నం బ్రమాదం బని నవ్వుచు నర్మగర్భంబుగా నిట్లనిరి. ౫౫

ఉ. ఎవ్వతె వట్లపో నెరసు లెన్నకమానదు ప్రాణభర్తలం
దవ్వుల నున్నఁ గాఁకకతన, న్మఱి హారలు వశ్యులైనఁ దా
రెవ్వతె నొల్ల కొక్కటయి యింద్రుఁడు చంద్రుఁడటంచు. బోటి దా
నివ్వలఁ జేరకత్తె యగు, నిట్టివి నీతలఁ వెగనే చెలీ. ౫౬

క. అనుటయు నెలనగ వడఁచుచుఁ
గన లించక తెచ్చి యొౌదు గఱమచు నయ్యం
గనలఁ గందుకనికరముఁ
గొని వ్రేయుచుఁ గెలను చూచుకొనుచుం బలికెన్. ౫౭

క. విడువక పీ గానము సొగ
సిడుటయు, మఱి పాడుఁ దనుట యెగ్గే? పాసెం
బఱగిన వారే పేదలె?
కొడిమేలు గట్టుకుఁడి యతనిఁ గాని పని యేలా ? ౫౮

శా. పోసిం దన్న, వయస్య లిట్లని, రగుం బో నిక్క, మిం కిప్పుడె
కాని, మ్మిం కొక కొంత సేవటికి నే కానీ. సఖీ, యెల్లియే
కానీ, నీనుడిఁ దన్మనోజ్ఞ గుణము ల్రానీ, తదన్యాయము
ల్రానీ, చిందినఁ జింత నీ కతనిపైఁ గా కెవ్వరిం దేల్చె దే ? ౫౯

సీ. నఖముఖోజ్ఝిత వరాబ్జముఖముక్త బాష్పంబు
వటిమ దీవవుఁ జిఱుచిటలు దెలువఁ,
బౌరి నుపాంశూత్స్రష్ట పూత్కృతు ల్కృశమధ్య
పార్శ్వ దుహుఃప్రవకంవములు దెలుప,

నొదవెడు గాద్గద్య మదిరిపాటునఁ బల్కి
రింపఁ బుట్టెడు కేకరింత దెలుప,
వలవంత విసువు కాంతల పుట్టు దూషించు
కారణంబుల తొంటి కతలు దెలుప.

తే. నలఁతఁ బానుపుపైఁ బొరలాట దెలుపఁ,
దెగువ లోలోననే నవ్వు నగవు దెలుపఁ,
గలఁకఁ జూమీఁదివనితేని కనరుదెలుపఁ,
బొలఁతి రేలు నీయున్కియే పులుగ గాదె. ౬౦

చ. ఎఱుఁగరుగా యొకద్భుతము! నీచెలి దీర్ఘికఁ దీర్థమాడ నా
యఱుతఁ దగిల్చి పోవుఁ దన హారము; పోయిన నేనుఁ బోవుదు;
న్మఱకువ వెంటఁ బోవ జలమగ్నత నౌ నదినున్న: మైనఁ దాఁ
గఱకఱిఁ బెట్టి సొమ్మడుగుఁ గాని నిజార్తి యెఱుంగ దేమియున్ ౬౧

చ. అనిన మరాళి పల్కె, వినవా హరిణీ, యొకనాఁడు కస్తురిం
గొని యిదు బొట్టు నా కనుచుఁ గూర్మి నొసంగిన?, బెట్టుచుండఁ, జూ
డ్డినుచు మొగంబు వ్రేసినటు లౌ తన యూర్పుల నింకి యింకి పో
యిన వలుబేంట్లు గోరఁ గొని యెత్తనె పట్టెను మాటిమాటికిన్. ౬౨

మ. అనినన్ స్రగ్విణి వల్కెఁ, దన్నుఁ జెలులారా, నే లతాడోలఁ జి
క్కన నూఁపం దెగి వ్రాల, దీని చనువ్రేకం బేక్రియః దాల్తునో
యని పట్టం, దిన మధ్య మార్క రుచి శీర్యన్మంజరు ల్పోని వా
డిన పాలిండ్లను బెండుబొమ్మ గతి నుం డెన్నంటిదిటం బుల్కనై. ౬౩

వ. అని తన యవస్థఁ దోఁప నాడిన ననాదరయుంబోలె వారల కిట్లనియె. ౬౪

క. అప్పఁగఁ దీర్పఁగ మిక్కిలి
నేర్పు గల వయస్య లట్లు నెలఁతలు మీ మీ
నేర్పునఁ బలికెద రక్కట
యేర్పడ మీ కీ విచార మేటికిఁ జెపుఁడీ. ౬౫

వ. అని మేలంబు సేసికొని తేలి పోఁబలికి పుటపాక ప్రకారంబగు వియోగ దవథు
భరం బవ్వధూరత్నం బడఁచికొని యుండియు నుండలేక నిశానమయంబుల
నొక్కొకమాటు తనలోన. ౬౬

సీ. అభినవ కువలయ శ్యామకోమలమైన
డాయూఁపు మకర కుండలముఁ దాల్ప,
నిస్తులాస్యశ్రీవయః స్తంభ నిక్షిప్త
నింబచ్ఛద భ్రూపు నిక్కనుంత,
పరువంపు మంకెన విరి వంపు నరవంపు
వాతెఱ చంద్రదంపు వాన గురియ,
నద్దంపు మెఱుఁగు వాలారు కన్గవచూడ్కి
శ్రవణకుండల కాంతి సవతుగాఁగ,
తే. సప్తభువనాంగనానురంజనకు సప్త
విధ పరీవాహముగ గాన సుధ వెలార్ప
మాడ్కి వేణువుపై వ్రేళ్ళు మార్చి మార్చి
మరులు కొలిపెడి గోవింద మందసతుల. ౬౭

ఉ. అక్కట రాధ నీకుఁ దగవా మగవారల నత్తమామలం
దక్కి ముకుంద వేణు కలనాదపు టీలకు లేటిమొత్తమై
త్రెక్కొనుచాఁకమై నడికి రేలరుదెంచిన గోపికావళిన్
బొక్కఁగ జేసి తద్రుచిర భోగము గుత్తగ నీవ కైకొనన్. ౬౮

ఉ. అక్కమలాక్షుఁ డొక్కెడ నిజాంసమునం దిడి కుంజపుంజపుం
జక్కికిఁ గొంచుఁ బోవఁ బెఱ చాన లినాత్మజవెంట వ్రేఁగుట
న్నిక్కిలి డిగ్గు పాదనరణిం జని రోయుదు రట్టె! రోసి తా
రక్కటఁ గాంచు టేమి! వల దా యభిమాన మొకింత యంతికిన్ ౬౯

చ. ఇలు గలనైన వెళ్వడని యీయువుటాంత్రకుఁ దాఁపికత్తెవై
యులు కెఱలించి శౌరి తను యోగపు వాచవిఁ జూపి మీఁదఁ గా
ల్లలము వియోగవహ్ని భవదంతర సైకతవంక్తి పొంత వం
తలఁ బొరలించె. తౌదు శమనస్వన వ్యగ్రమయాఖనందనీ! ౭౦

వ. అని యొంటి పాటువం దినలోనం బలుకు వలుకు లాలించి పొంచియున్న
వయస్యలాస్యంబు లవహాస్యచంద్రికాతుందిలంబులుగాఁ దోఁచి 'భామ,
యేమేమి? నీ మనం బెఱింగియే కదా మును మున్న యతనిమాటలు మానలే
నంటి' మని మూదలించినం గించి దవనతాననయై నెమ్మొగంబు వెలవెల

పాటు లేనగవున నడంచి మఱి మెఱుంగ ననువుపడక యందంబుగూడఁగాని వారి కిట్లనియె. ౨౧

తే: 'నాఁడు మన మున్న నెట్లొ పూఁబోఁడులార,'
యనిన, వారలు మాఁటడ నా యమకు వనిరి
'యింతి, నాఁ డుండ కెందుఁ బోయితివి నీ ?' చ
టన్న నచ్చెరువడి వారి కలిప పలికె. ౨౨

తే. 'సకియలార, త్రైకాలిక జ్ఞానవంతు
లైన ఋషులట్లు పలికెద, రంత యెఱుక
యెదఁ గలిగెనేని యెఱిఁగింపుఁ, డేను మొదల
నెవ్వతె' మున్న ; మఱి వార లిట్టు లనిరి. ౨౩

మ. "దివిజద్రుప్రసవంబుఁ గాంచిన సపత్నిం జూచి, చూ పోవ, కిం
తవుజిల్గుంబని యంత సేసి, మది నీ ర్వ్యా ... ల్పందడిం
ప, విరిం బోక, ద్రుమంబుకై కొని, వతి న్మందన్న ద్రామా నెల్లఁ దే
నవధిం బెట్టిన సత్య నీ వహహా ; కా వా కామినీ !" నావుడున్. ౨౪

వ. గ్రక్కునం బ్రత్యుత్పన్నవిజ్ఞానయై, గృహదీపికారోపణంబునం గృహగత పదార్థంబు లొక్కమాటె దృగ్గోచరంబు లగునట్లు. జన్మాంతరంబున నయ్యనంతుని తోడి క్రీడాప్రపంచంబు సద్యస్సమనుభూతం బైన తెఱంగునం దోఁచిన. ౨౫

ఉ. వాలిక కన్నులం బొడము వారి నక్జల మాశ్రితశ్రవో
గోళక మై తదంతికపుఁ గుంతలవల్లికిఁ దల్లితోడుగా
మైలవళి న్నన ల్నిగుడు మైఁ బులక ల్నిగుడన్ శ్లథాంగియై
సోలినఁ జూచి డెందములు సుఖ్ఖన హాయని బోటు లర్మిలిన్. ౨౬

ఉ. ఎంతకుఁ దెచ్చెనే నరసిజేక్షణ చెయ్దము ; లిందుమీఁద జ
న్మాంతర వర్తనంబు హృదయంబున కిత్తఱి నెచ్చరించి గో
రంతలు గొండలంత లగు నట్లుగఁ జేసితి, మంచుఁ గూపికో
ద్వాంత సతాళవృంత మృదు వాత హిమాంబుకణాళిఁ దేర్చినన్. ౨౭

క. తెలిసి కను దెఱచి వెండియు
జలజేక్షణ తన్ముకుంద చరణస్మృతిని

శ్చలతఁ గను మొగిచి మఱి య
క్రులు తెప్పలఁ ద్రోవఁ దెఱచి జూచి సఖులతోన్. ౭౮

క. మీ రెవ్వ రనుటయును, శృం
గారిణి, మే మురగకన్యకల; మింతకు ము
న్ధారుణి కేతెంచితిః మన
నారామలఁ గౌఁగిలించి, యార్తి న్బలికెన్. ౭౯

ఉ. అట్టి మురారి కిప్పు డనుఁగై, మఱి యోక్తలివేళఁ గ్రమ్మఱం
బుట్టి వియోగవేదనలఁ బొక్కెదు నీ తను వేల? తండ్రి దా
నిట్టఁ నన్ను నిం కొకని కియ్యక తాల్తన. యోగశక్తిఁ బో
బెట్టెద దీని, వెండియు నుపేంద్రపదాంబురుహంబె పట్టెదన్. ౮౦

క. అది యెంతె భక్తి, యెవతే
నెద విశ్లేషైకభీరు వృత్తిఁ బ్రియాలా
భదశన్మొయిఁ బొటఁగించిన
హదనన యదిగాక యున్న యవి వైరిః ముల్. ౮౧

తే. అనిన వారలు పల్కి, "రా యదువతంస
మెందు జన్మించుఁ? విను, రంగ మంద నిల్చె
వేగఫా చేల? యతఁడ నీ విభుఁ డగుటకు
నర్పునాదుం నిప్పటి హరి భజింపు. ౮౨

చ. అలుకి కు" మన్నఁ దేతః మఱి యంతటనుండియు వేళ వేళ నెచ్చె
చ్చెలు లిడు తెల్వులు న్మగుడఁ జింతల నంతమనంబులు న్సమా
కలితత మించె సౌమ్మిదని కార్శ్యమునన్ హృదయంబున న్సదా
వల్లవలగాఁగ నీలపుల బన్నసరం బయి నిర్మలాంగికిన్. ౮౩

తే. ఎలని యేప్రొద్దుఁ గనుపొంద నీక మరుఁడు
కలహమున కంకకాఁడయి కాలు ద్రొవ్వఁ,
బాంథబహుళకీ పాపరంపరలు వెదల
కింటిలో నేదుముల్లు య్యె నిందుముఖికి. ౮౪

మ. తలిరుంగై దువుజోదునానతి వధూ ధైర్యంపుఁ బెన్గోటఁ గం
దళి తాహర్మ్యభయంత్ర కారుఁ దలుక న్నానాటికిం ద్రెళ్ళఁ గో

మలమారంఢమరీచిదీపకశికోష్మం జూచి యే యుం దళ
ర్ధళ పాథోరుహకోశకుహరోచ్చ్యచ్చంచరీకాళ్మముల్. ౧౫

గీ. పొంత ఘటయంత్రనరముఁ ద్రిప్పుచు జపించు
మగువధృతి దూల మధ్యాహ్న మంత్రవాది,
సురుచిరవితానదంభ కౌసుంభధారి
తుహినధారాగృహాంగి బిందువులు సెదర. ౧౬

ఉ. తామరసాపత్రామముఖి దంష్ట్రిత విస్ఫుట మల్లి హల్లక
స్తోమరజశ్ఛటాంగక మధుద్యుతితార వియద్ద్రుచంద్రకమో
ద్దామ పిత్ర్యప్రసూ ప్లవగ ద్రైస్వరుతోత్థ రథాంగ పోత. చిం
తామయ నిద్రలం బొలసి తాపము సేయఁ దొడంగె నింతికిన్. ౧౭

వ. ఇ త్తెలంగన సకలకాలంబుల నారటంబునకు నూరటఁ గానకుండియు
నప్పుండరీకాక్షి యందుండు నప్పుండరీకాక్షు నారాధనంబున నారాధరమణుం
గ్రమ్మఱ జెంద డెందంబునం దలంచి. ౧౮

సీ. పద్మాస్య ప్రతిదిన ప్రత్యూషమును మౌన
నియతి మేల్కని, నఖీచయము మ్రోల
హేమపాత్రిక హరిద్రామలకాద్యిక
స్నానీయవస్తు వ్రజంబుఁ గొనుచు,
ధౌతాంశుకంబులు తడియొత్తులును దేర?
నంతఃపథంబున నరిగి, నిజగృ
హారామదీర్ఘిక ననుసంహిత ద్రావి
డామ్నాయయై స్నాన మాచరించి,
తే. పద్మినీలేశ పూర్ణసౌభాగ్యదాంగ
ధూతి చకచక లీరెండతో డ మూట
యయ, నిడువెంద్రుకలగుంపుమలఁచిపై చి
వేగ వెస వెడ దడి యొత్తి, విధియుతముగ. ౧౯

ఉ. కుంచరాగ్ర నెన్నొసల గుమ్మడిగింజ తెలంగు పాండుమృ
ద్బిందువుఁ దీర్చి, చెందిరము పేచకశీర్షముపై బలె న్గటిం

జందుర కావిజీ ఖమరఁ, జల్లని రేయిటి తట్టుపున్నగళ్
న్విందులఁదేల్చ, నూనెముడి వెండ్రుకలుఁ దడితావు లీనఁగన్. ౮౦

తే. తోటి గట్టిన చెంగల్వ పూవుబెత్తుఁ
దరు వరిణ తోరు కదళి మంజరియుఁ గొనుచుఁ,
బోయి, గుడి నంబి విజనంబుఁ జేయ జొచ్చి
మ్రొక్కి వేదికఁ బలువన్నె ముగ్గు వెట్టి ౮౧

తే. కపిలగవి సర్పిఁ బృథు దీప కళికఁ దీర్చి
ద్వయముతో వక్షమునఁ గల్వదండ సేర్చి
యగరు ధూపంబు లిడి శర్కరాజ్యయుక్త
హృద్యకదళీఫలాళి నైవేద్య మొసఁగి. ౮౨

క. ఖండిత పూగీ నాగర
ఖండంబులు ఘన శశాంక ఖండంబులచే
మండితమగు తాంబూల
మ ఖండస్థిరభక్తి నొసఁగి కదలి చెలులతోఁ. ౮౩

తే. చెలువ గర్భగృహ ప్రదక్షిణముఁ జేసి
వినతయై మౌళి శఠకోపమును ధరించి
చరణతీర్థముఁ గొని తత్ప్రసాదలబ్ధ
మైన మాల్యముఁ దాల్చి గేహమున కరుగు. ౮౪

క. ప్రతిదినము నిట్లు చని య
చ్యుత పూజ యొనర్చి వచ్చి సుదతి వియోగ
చ్యుతధైర్య యగుచు నయ్యదు
పతి గుణములు ద్రవిడభాషఁ బాడుచునుండున్. ౮౫

తే. మొదల నాముక్తమాల్యద-మదనతాప
తరణి వెనువెట్ట వేఁగిన దక్షిణాశ
మత్కృతోష్మకుఁ దుదముట్ట మాఁడు ననుచుఁ
దొలఁగె నన నుత్తరాశకుఁ దొలఁగెఁ దరణి, ౮౬

## వసంతర్తువు

చ. తెలియఁగ వచ్చె నట్టితఱిఁ దిగ్మకరుండు ధనాధిపాశకై
తొలఁగినకారణంబు, బతివ దుర్వహ దీర్ఘవియోగవహ్ని పె
ల్లలమిన తద్దిశం దగిలి నట్టి తనూష్మ ఘనీభవన్మహా
జలమయశంకర శ్వశుర శైలము కోనల చల్వఁ దీర్చుకోన్. ౯౭

తే. కినిసి వలజేఁడు దండెత్తఁ గేతు వగుట
మీన మిాఁ దోఁచు టుచితంబు, మేష, మేమి
పని యనఁగనేల ? విరహాళ్యఁ బాంథయువతి
దాహమున కగ్గి రాఁగఁ, దత్తడియు రాదె ? ౯౮

చ ప్రియ పరిరంభణ ప్రథిమపె ల్లిఁక నామని వచ్చి చేయుఁగా
వ్యయ మని సీతునందె చెలువ ల్పెదవు ల్లడువంగ వచ్చెఁ దా
రయమునఁ బేర్చి యా ఋతువు : రాఁ జలి విచ్చి తొలంగ ర య్యవ
స్థ : యుచితమే కదా 'విపది ధైర్య' మనం జనుమాట యింతకున్. ౯౯

ఉ. స్పృష్ట బహు ప్రవణం బయిన సీతున కల్కి నిజోష్ఠపల్లవో
చ్ఛిష్టముఁ గొన్న డిమ్మధువి సీయన కింతులు మోవిఁ దన్మధూ
చ్ఛిష్టముఁ గొన్న యొచ్చె మఱఁ జేసిన, వారు కృతం బెఱింగి వి
స్పష్టముగా నొసర్చిరి వసంతున కాఱటి దోహదంబులన్. ౧౦౦

మ మునుపే చంద్రబలంబు గల్గి మలయంపుంగమ్మ లేగాడ్పుఁదే
రున నేతెంచు లతాంత బాణునకు సూర్యుండు న్మహిం ప్రగొత్తగా
ననుకూలించె జలంబున న్విరహిణీ ప్రాణాపహారంబు సే
యన యూహించు విధాత కృత్య మది యేలా మాను నెప్పట్టునన్ ? ౧౦౧

క. మలయ కటకోటిజస్థిత
కలశీసుత సేవ నిట్టు గనెనొ తదాశా
నిలఁ డనఁగ నలనవృత్తిన
మెలఁగుచు నాపోశనించె మిహికాజలధిన్. ౧౦౨

క. మలయతరు న్యాయమ్మ యిలఁ
గల తరువులకెల్లఁ జేయఁగా ఫలమ్మే జుమీ

చ. తనయుఁదరంబునం బొడమి తామ్రమరుచ్చిచ్చుట లుల్లసిల్లఁ గో
లొ్కాను ధరణీజ సంతతికిఁ గొంక దంతము లిందుకంతని
క్కొనయది యాదిగాఁగఁ జెలఁగెఁ వనలక్ష్మి ; గడుం జెలంగఁగా
జను, బ్రియుఁడైన మాధవుని సంగతి మీఁదటఁ జాలఁ గల్గుటన్. ౧౧౬

సీ. ముసు నన ల్దమిఁ బట్టి, ముంగాళ్ళ, ముక్కుజో
దనలఁ బీలిచి పసరొ్కానిన విడిచి,
పసువంపు విరి గొందు లరసి, చాలై త్రోవఁ
బెట్టి యారము లీఁగు పిండుఁ దగిలి.
క్రొవ్విరి దొలుత దొలుత నొక్కొఁచు గని యది వ్రాలు
తఱి దాని నీలఁ బసఁ దాఁకి గ్రోలి;
యాకురాలుపుగండ్ల నానెడు నాన నిం
తడు గూడి బం కంటి యంగలార్చి,

తే. యెట్టకేలకుఁ నొక డబ్బఁ బొట్టనిండఁ
గ్రోలి యనిగాలిఁ గదలినఁ గూలు. నగుచు
బ్రమదవనపాలికలు వేడ్కఁ బట్ట నగుచు
మధుదినాది క్షుదాభ్రమ న్మధుపచయము. ౧౧౭

సీ. మరుదూఢ మలయాహి గ్గరధూమ్య లనుగళ
న్మనవిజ రథవ దాంజనకళికలు
త్రాన ధావ చ్ఛిశిరత్యక్త బాష్పముల్
వికవంచమస్వరోద్వేద వీణ
లబ్ధాగమన్మరం దాసార జంబువుల్
హిందోళ సాక్షా న్మకుందరోచు
లభిసారికాంశుకోద్యన్నీలగుళికలు
జాత్యనుల్లనసాత్త శావతతులు

తే. చైత్రసంజీవనౌషధీ జాతచేత
నాత్మజని హేతు తరు పునర్యాయి యువతి
కచవిధూత హసంతికేంగాల చయము
లళుల పంక్తులు వనుల నక్షావఁ దొడఁగె. ౧౧౮

తే. ద్విజతఁ గాంచియు మధుసేవ విడువలేక
జాతి బాపిన తేంట్లనిస్వనము గూడు
కొనుటనో యనఁ గోకిల స్వనము సెలఁగెఁ
దనకు మఱి పంచమత్వంబు దప్పకుండ. ౧౧౯

ఉ. పూచినమావులం దవిలి పూవిలుజోదున కమ్మె మాధవుం
డేచిన శంక; నాతఁ డవియే కొనియే పథికావళీజయ
శ్రీచణుఁ డయ్యె; నట్టిద; యకృత్యముచే నగునట్టి పీడయుం
గోచర మౌనె, దైవ మనుకూలము నై, పరు మేలుఁ దీఱినన్. ౧౨౦

మ. ఉరుశక్తి న్మధుమాసదోగ్ధ పిదుకన్ జ్యోత్స్నాగవీచంద్రమస్
స్ఫుర దూధః ప్రవిముక్త మైన నిబిడ జ్యోత్స్నాపయఃపూరమన్
విరియంబాఱినగొజ్జఁగ ల్లురియము న్నిరైన యక్కమ్మనీ
రు రహిం గూడిన నేర్పరించు గమ్ములై రోలంబకాదంబముల్, ౧౨౧

ఉ. దిగ్గియ నంచ దూఁడు గొని తీర వనేక్షువువంక మీఁదుగా
నగ్గెడ పుల్లకేసరమునందు వసింపఁగ నెక్కనూలి ను
న్బ్రిగ్గము నందఁగాఁ దరు మరంద సరోమకరంద గోష్ఠికిన్
వెగ్గల మాడు తేంట్లు మరు విందికి బూనె గుణద్వయత్వమున్. ౧౨౨

చ. నిడుద మధూళిక ల్నడుమనే కొని తీఁగలు సాఁగఁ జుట్టుకొం
చడరి కడార కాచకటకాకృతి సుళ్ళు మెలంగె గాడుపుల్
జడగతి నధ్వనీనవరిషత్స్ఫుటనిశ్వసితానలం బెదు
ర్పడ మఱి సార్చులై చుర చురం దుద సుళ్లుగ సుక్కెనో యనన్. ౧౨౩

చ. కురిసినక్రిందిపుప్పొడులఁ గొంచు నగంబుల మీఁదికై విశం
గరుచులఁ గొన్ని పెల్లగ సెగాడ్పులసుళ్ళ్యతి మాధవుండు రా
నెరవుగఁ బూవు సొమ్మిడి వనేందిర భూమికి వెండి మెట్టదా
మరరవణంబు తాఁ గొన, భ్రమ మద్గతులౌ మలుచుట్టులో యనన్, ౧౨౪

చ. తరుణు లదోనిదాన మధు ధార నస ల్వకశాళి నింపఁగాఁ,
దరుణుల మేము గామె యన తద్గతలౌ వనదేవత ల్సురన్
ధర వకుళౌఘ మెల్లను న న ల్గనఁ గ్రాయఁగ నించుబుగ్గలన్
ద్గొరసె మధుప్రపూర్ణిత మధూకములం బ్రథు పాండుపుష్పముల్. ౧౨

చ. అలరెఁ బ్రియాళి వోర్తు ప్రియ మౌట వసంతముఁ బాడ, నప్పు డ
వ్వెలఁది నపత్ని 'భక్తికిని వేల్పులు మెత్తురు గాన రాగము౯
చలమునఁ దన్నుఁ బాడఁగ వసంతుఁడు దా దయచేసెఁ గాక, యీ
యలె నిజశక్తి నా' యనుచు నాపనకుం గొదవెట్టె నీనున౯. ౧౩౩

తే. అధరసుధఁ బ్రాణిజతఁ బ్రాణి యగుచు మౌక్తి
కాండమాలిక నిదెను సాసూగ్రమౌక్తి
కంబ యనఁ జాలు నన లిచ్చె గతజరత్సు
మంపు వావిలి మొగ మూర్చ నింప నోర్తు. ౧౩౪

చ. ఘన మగు నాతు ల లి, తిలకం బటిరిక్తత నున్న, నోర్తు, లోఁ
గవికర మూని, కిన్నుఁగపఁ గాయముఁ గిల్లత యిద్ద తూపుకే
యనువుగఁ నించెఁగాక, మఱి యంక ముట్టక యొక్క జేష్టలె
క నెగడఁ జేసె నంట యిది కల్లనఁగా, నగించెఁ బూవుల౯. ౧౩౫

తే. సాంద్రమకరంద వృష్టి రసాతలంబుఁ,
దొరఁగు పువ్వుల ధూళియుఁ, బూ ధూళి నభము,
నీక్రమత్రయి మాధవుఁ డాక్రమించె
నురు విరోచన జనిత మహామహిమ పొంగ. ౧౩౬

క. ఊరకొనఁ బదు మధూళిక
యోడికలకుఁ గ్రిందఁ గ్రవిమ్మ యుండెడు తేంట్ల౯
నీడలు దిరిగియుఁ దిరుగని
జాడఁ దరు ల్వొలిచె నవ్వసంతపు వేళ౯. ౧౩౭

చ. శతదళమంజరీ ధవళ చైత్ర నిశామల చంద్రికౌఘముల్
ధృత వియదంత కేళి వన వృక్ష లతాంతర జశ్చుట న్గళం
కితఁ గని కామినీ కమన కేళియుఁ దోఁజెనదా నగాటవీ
కతక వరాగ మొక్కడెనఁ గ్రీష్మ యనచ్ఛత మావ్రకుండిసన్. ౧౩౮

సీ. శైత్యపాండిమలు దుషారాంతమునఁ జేరె
నిరులుకొ స్త్రాత్రిషవందిరుల విరుల,
వలయ గానము లయుక్తల కార్శ్యములు చేరె
ఘల్లయంతఁ గమ్మపీవలుల వల్లుల,

సౌరభోల్లాసము ల్జాతి గ్రుంగఁగ జేరె
నలరారు గొదమ క్రోవులను నెలను,
స్ఫుట జటామస్కరంబులు ప్రతిచ్యుతిఁ జేరె
నందన ప్లక్ష సంతతుల వృతుల,

తే. స్వాభృతపరభృత వినుత రసాలవరిష
దహరహఃక్లుప్త బహురహఃప్రహరవిహర
మాణ మానవతీ పరిమ్లాని మాని
వారి వారిజవన గంధవాహ మొలసె. ౧౩౯

ఉ. సారెకు గీరము ల్పొం రసాలము శాఖలలోనఁ ద్రిమ్మరం
గా రహిఁ ధన్మ ధూళికకుఁ గా నళిపంక్తులు వెంట గ్రొమ్మరం
గా రొద మించె నందుఁ జిలుక ల్వనలక్ష్మి యుఁ దద్వచస్సుధాం
ధోరుచు లానఁగా సరవణు ల్జనుల ట్లిడి వెంపఁగా బలెజ. ౧౪౦

సీ. ప్రతిహంతృతాత్త కీటత చన్న భృంగనం
షుపుటంగములచేతఁ గాయమెత్తి,
యమదిశాగత మరు త్ప్రాణియై దడశిరం
గ స్థలాబ్జినిఁ దమ్మికన్ను దెఱచి,
ప్రాంతపుల్లామ్ర సంశ్రయి తచ్ఛటాహతో
ద్ధతి లేచి చెలిఁ జైత్రుఁ గౌఁగిలించి,
యుఱు పరాగపుశాటి నుద్దండ వాప్యుత్ప
లనవత్సిధు రత్యన్న ముడిపి,

తే. క్రమ్మఱఁ బలాశ కటకాముఖమునఁ గీర
చలితశాఖాస్ఫుటాశోకశరముఁ గూర్చెఁ
దదతికిఁ గాఁగఁ జలికాలఁ దన్ని మంచు
పాండురాంగండు విడిచిపో బదికి మరుఁడు. ౧౪౧

చ. చిగురుఁ బికాళికి, న్పలముఁ జిల్కల కుంపునకు. న్మధూళిఁ దేఁ
టిగమికిఁ, దావి గాలికి, విటీవిటకోటికిఁ బువ్వులుం, దలం
బునఁ గృప నీవియు స్సురభి పుంస్త్వముఁ బాంథులచోటఁ బూనె; న
ట్లగుఁ బ్రజ కోర్కు లిచ్చుతన కాత్మఁ దలంచిన దబ్బ దే యనన్. ౧౪౨

సీ. సహకార ఫలరస సౌరభ్యములఁ గూడి
మాధ్వి మోవులఁ గదంబముగ వలవ,
మలయజోదరత జంభల ఫలత్వగ్గత
శ్రీ మించుచెవులఁ గొజ్జఁగలు మెఱయ
శశికదళోదర చ్ఛదవుఁ బావడ లూరు
చకచకఁ బట్టి పాలికిఁ బెనంగఁ,
ద్రాక్షా తేంట్లకుఁ గాఁక లెక్కింపఁ జెరివిన
గంధఫలీవం క్తిఁ గబరు లలరఁ,

తె. గేలఁ గలవంటకవ్రుఁదావికిని బులిమిన
ఘుసృణములు మించ, ననలఁబేరెనఁగ వవన
ములు నమేరురజోవృష్టిఁ బూడిఁ జఱవ
నింతు లెనసిరి పూఁబొద రిండ్లఁ బతుల. ౧౪౩

వ. అట్టి సమయంబున. ౧౪౪

ఉ. కామిని మేహరంజి మధు గర్వ మెదంతు నతంచు. లో నిజ
క్షేమముఁ గోరి, పాడి, మణి చిత్ర మరుత్త్వజతా ఛరద్యుతి
స్తోమ వలాహకావలులు దోఁచి, ప్రఫుల్ల కదంబ కేతకీ
ద్దామ సమీరణాహతులఁ దాపము నీ నొఱగు న్విచేష్టతన్. ౧౪౫

తే. అతివ పూర్ణేందుభీతిఁ ద దశ్మశాలఁ
దెంది యతఁ డందు విదుమడి తింద్రఁ దోఁప
మింటివయి నుంట గా దని యింటి పైకిఁ
దెచ్చుకొంటి నటంచు బెళ్ల టిచ్చ వెతలు. ౧౪౬

తే. భ్రమరగీతిక మాయ విపంచి మీట,
దాన శ్రుతిఁ గూడి మిగులఁ దద్ర క్తి హెచ్చ,
వే నివారించి లేచి, 'దైవికము నెదుట
యుక్తులు ఫలింప' వనుచు బి ట్టూర్చె నవ్వ. ౧౪౭

తే. వెలఁది కతితావదం బయ్యె విరులపాన్పు;
మును దొదంశ్రమిహతాది భర్సనలుగన్న

తరులు, బొదమిన పూలు దన కొసఁగునె,
బొంచి తటివేచి మిగిలనొప్పించుఁ గాక ? ౧౪౮

శా. పూజాదంభమున న్పరాకుమెయి ము న్పూఁబోఁడి నేర్పూఁది చే
తోజాతానల మార్ప శాస్త్రసరణిఁ దూలి న్హరి న్వ్రాసి పి ల
జ్జాజాడ్యాకులదృష్టిఁ బ్రత్యవయపేక్షం జేయుచో వెండి వ
క్షోజాగ్రద్రమఁ గాంచి తల్లడిలు నీను న్భావమున్ మీఱఁగన్. ౧౪౯

చ. కుముదరన స్తట స్ఫటిక కూల నవోత్పలశయ్య బ్రాలి, పూ
ర్ణిమలఁ బికాళిఁ గట్టునురు బ్రెక్కఁగన ధర్మపుదార పట్టు శే
షము రెయి మల్లికాళిరుతి చక్కఁగఁ జేయ కయుంత నిల్పు, నా
యమ మఱునాఁటికిం గలుగ, నాంతగళ చ్ఛ్రిత గుంఠితాక్షువుల్. ౧౫౦

తే. నెలఁతఁ గుచకుంభ యుగళ ముండియు వియోగ
జలధి యీఁదింప లే దయ్యెః సఖులు వంచు
మన్న పన్నీటి వెల్లి లోఁగొన్నకతన,
మునవ కది లాఘవమునఁ దేలింపఁగలదె. ౧౫౧

ఉ. చంచలనేత్ర దాల్పు జలజాతమృణాలసరంబు వెగ స
శ్శించినఁ, బాఱుతెంచి కబళించి తదూష్మకు నంగలార్చు రా
యంచ కుచేష్టఁ గాంచి, యిఁక నైనను గందుమొ యంచు మోమెవీ
క్షించినఁ, దోఁచు లేనగవు నేరుచు బోట్ల కొకింత ప్రాణమున్. ౧౫౨

ఉ. శ్రీపతి మీఁది గీతముల ప్రేమ వివంచిక నంటఁ, బాణి నం
తాపము సోఁకి మెట్లమయినంబు గరంగిన, డించి, పాడ నా
లావినిఁ దాల్చి, మెన్మెమటల న్మఱి తంత్రులు జజ్జుకోఁ; గలా
లాపిని దాన పాడును, గళంబును గద్గద మైన; బ్రాన్పడన్. ౧౫౩

తే. ప్రతికుసుమతల్పమునఁ జాటి వడిన త ప్త
వలయ మలినాంకయుగము వ ర్తులతఁ బొలిచెఁ,
జూడ నిఁక మాన ధైర్యము ల్నున్న లనుచు
సుదతి బోట్లకుఁ ద్రవ బ్రాని చూపె ననఁగ. ౧౫౪

ఉ. ఆ వనజాక్షి కాఁకఁ బొరలాడ, నలంగిన సొమ్ముఁ జీరలున్
వే వెస నూడ్చి యూడ్చి మఱి వేఱ వహించుటఁ వార్ధక ప్తమ ల్

గా వనమాలి సేవయెడఁ గొంకు నొందుంగక, కల్లతెల్వితో
నే వలపుంత దాఁగఁ జరియించిన, దాఁగమిఁ జూచి నెవ్వగన్. ౧౫౫

క. పుత్త్రియుఁ దాఁ గామిని నొక
పుత్త్రియు నట్లుండుటకు నబుద్ధేక్షుధనుః
పత్త్రి యగు విష్ణుచిత్తుఁ డ
పత్త్రప లే కడియు నేతవంటో యనుచున్. ౧౫౬

వ. తలపోసి దినదిన ప్రవర్ధమాన తనయా తనగ్లాని కత్యంత దుఃఖితుండై తత్కారణం బెఱుంగక వల దని మౌగ్ధ్యంబున వారించి చూచి యంత కంత కగ్గలం బగుడు గుడికిం జని పూజాంతిమ నమస్కారణానంతరంబున, దన మనో నిర్వేదనం బన్నగరి వెన్నునకు విన్నవింపం బునర్నమస్కృతిం జేసి, “దేవా దేవరదాసి యగు మదీయ పుత్త్రి యేమి గుఱించియో విచిత్రంబగు ప్రతిచర్యం గాత్రశోషంబు సేయుచున్నది. వల దన్న విన, దపుత్త్రికుండ నగునాకుఁ బుత్త్రియైనను బుత్త్రికుండైనను దాన, యే నేమి సేయుదు; మఱి తన తపశ్చర్య తెఱంగు మా తపశ్చర్య తెఱంగు గాదు, ఏము భవద్దివస భవజ్జనిదివస రాత్రులం దక్క గణరాత్రజాగరంబు లెఱుంగ, మేము బిసబీజాక్ష వలయంబులు, దక్క ఓనవలయంబు లెఱుంగ, మేము ప్రసాదకుసుమంబుఁ జెవిఁ జెరుపుటఁ దక్క నవి గప్పుకొన నందు శయనింప నెఱుంగ, మేము చెంబుల భవత్తీర్థంబు గ్రోలినఁ దా నంగంబులు దడిపి కొను, మేము చాంద్రాయణంబులం జంద్రప్రవృద్ధిఁ బడిఁ గడియెక్కించినఁ దా డించు, నేము నిదిధ్యాస నిశ్వాస నిరోధంబు సేసినం దాఁ దద్ధ్యానదశ వెలికి నిగిడించు, నేము చిన్ముద్రికై హృదయంబునం గేలు సేర్చినం దాఁ గపోలంబునం జేర్చు, వల్కలోత్తరీయంబు లేము వహించినం దాఁ గిసలయోత్తరీయంబులు వహించు, నేము సితపక్ష నూత్నేందుఁ గీర్తించినం దాఁ బూర్ణేందు నుపాలంభించు; నిట్లుగా బ్రవర్తిల్లుచున్నయది; యిది యేటితపం బున్మాదంబు గానోపు, నెంత భవదీయ భక్తి గలిగిన మాదృశులకుఁ బ్రకృతి సంబంధంబు విడువ; దంతర్యామివి నీవెఱుంగని యది లేదు; దీని తెఱంగెఱింగింపవే;” యనవుడు, ననుకంపాతిశయంబునఁ దచ్ఛందసంబునకు మందస్మితంబు సేసి మందరధరుం డిట్లనియె. ౧౫౭

## ఆశ్వాసాంతము

ఉ. కంధర నీలవర్ణ, మధుకైటభ నాగ సుపర్ణ, యోగిహృ
ద్గ్రంథిభిదోత్థ భోగివనితా స్వనవచ్ఛ్వసన స్రవ చ్చిర
స్పంధి వన స్నిశాపతి రస స్రుతి దుగ్ధవయోధి వీచికా
మంథరకేళి కాదర, సమాశ్రిత పంక్తిశిరోఘసోదరా. ౧౫౮

క. ప్రపదానిశ నతిచర్యా.
త్రిపదాపనపర్య, నాకదేవాద్యమర
ద్వీప, దానవాహితోదిత
విపులాత్మభవా, భవారివిశ్రుతనామా. ౧౫౯

## తోటకవృత్తము

ద్రుహిణాండకరండక ధూర్వహగ
ర్భ, హరార్భక దుర్భర పక్షతవః
కుహనార్భక, వార్భృత కోనిరి హా
రి హిరణ్మయ హర్మ్యచరిష్ణుపదా. ౧౬౦

మ. ఇది యంధ్రోక్తి యథార్థనామ యవనాస్యకూర్ణ కెంబావి వా
రిద వర్ధ త్యవరోధి వప్రపవలయ శ్రేణీపిఘాతక్రియా
న్వద సేనాగ్రగ కృష్ణరాయ మహిభృ త్సంజ్ఞాస్మదాముక్తమా
ల్యద నాశ్వాసము పంచమం బమరు హృద్యంబైన పద్యంబులన్. ౧౬౧

### పంచమాశ్వాసము సమాప్తము

—:౦:—

శ్రీరస్తు

# ఆముక్తమాల్యద

## షష్ఠాశ్వాసము

శ్రీకారి కృపార్ద్రేక్షణ,
వైకుంఠ, యకుంఠ, భక్తవరద పదాబ్జ
స్తోక మరందాయిత గం
గా, కాకోదర నగోదయస్థ పతంగా. ౧

వ. అవధరింపు మనంతర వృత్తాంతంబు. ౨

### మాలదాసరి

చ. కలఁ డొకరుండు పేరుకొనఁ గాని కులంబు మఱియభక్తుఁ, డి
య్యిల మును వాఁడు వామనత నే వసియించె నొ పుణ్యభూమి, నం
దుల కొకయోజనత్రయపు దూరపుటూర వసించి, బ్రాహ్మవే
ళలఁ జనుదెంచి పాడు మము లాలన మంగళనామ కైశికిన్. ౩

వ. అహరహంబు నమ్మహాత్ముండు. ౪

క. జాత్యుచితచరిత్రమ
మత్ప్రీత్యర్థం బూఁది తనదు హృదయము శుచితా
నిత్యంబుగఁ దత్తనుసాం
గత్యము మనిపెఁ దమానితంబై యెదుఁగన్. ౫

సీ. చమురైన తోల్కుబుసంబు పెట్టియును ని
త్తడి శంఖ చక్ర కుండలము లమర,
దిపెదారికొమ్ముఁ దోల్త్రిత్తియు జోడమ్ము
మెడమీఁది మొగలాకు గొడుగుఁ దనర,

A—10

మత్ప్రదక్షిణయ మాపు పెన్నెఱకఁ గు
ట్టిన యోటి తిపిరిదండెయను మెఱయఁ,
జిటితాళములు సంక పుటిక నొక్కొకమాటు
గతిరయంబున, దాఁకి కలసి మెరయ?

తే. వలుద వనమాలకంఠెయు మలిన తనువుఁ
బట్టెతిరుమన్ను బెదరుగెంపుట్టుఁజూపుఁ
బసుపుఁబొడితోలువల్లంబు నెసక మెసఁగ
వచ్చు సేవింప సురియాళు వైష్ణవుండు. ౬

శా. గండాభోగముల న్మదశ్రుబహుధార ల్గప్ప న్నుతు ల్వాడి యా
దండ న్వేఁగులు డించి భక్తి జనితోద్యత్తాండవం బాడు, నా
చండాలేతరశీలుఁ డుత్పులకుఁడై చాండాలిక న్మీఁటుచున్,
గుండు ల్నీరుగ, నెంత గాలి వసి తాఁకుం జూవ, కాప్రాహ్ణమున్ ౭

తే. అట్లు దడవుగఁ గొల్చి సాష్టాంగ మెఱఁగ
గర్భమంటపిఁ గడిగిన కలఁకజలము
లోని తూతొట్టి నిండి కాలువగఁ జాఁగి
గుడివెడలి వచ్చునది శూద్రుఁడడఁగ గ్రోలి. ౮

ఉ. ఆతఁడు ముఖ్యజాతిఁ గని సంతన పాయుచు, నెండ గాలి నెం
తే తడవుం బ్రసాద వినియోగము వార్చి వసించుచుం, ద్రివ
ర్ణేతరజాతి మెచ్చి దయ నిడ్డ ప్రసాదము దండె సాఁచి శ్ర
ద్ధాతిశయంబునన్ వినతి నంది, భుజించుఁ, గొనుం దదంబువున్. ౯

వ. ఇట్లు దన దివాకీర్తి జని నప పరమార్తి నైచ్యంబు సకలజన శోచ్యంబుగా గుడి లోఁపరా తూపరాణి కడ నిలిచి బహిరావరణ ప్రదక్షిణంబ కావించి ప్రొద్దెక్క నిజపక్కణంబునకుం బోవుచుండు, నిట్లుండి యొక్కనాఁడు. ౧౦

క. అద్దమరే యద్దాసరి
యద్దండ బిడాలగాహి తాలయ కృకవా
కూర్ధండ రవము విని చను
ప్రొద్దాయె నటంచుఁ బాతఁ బోవుచుఁ ద్రోవన్. ౧౧

ఆ. మరులుఁ దీఁగ మెట్టి యిరు లన్న నో యని
యెదు తమిస్రనఁ గాఁసుపడి పొలంబు
లెల్లఁ దిరిగి తూర్పు దెల్ల నౌతఱి నొక్క
శూన్య హనవాటిఁ జొచ్చి చనుచు. ౧౨

సీ. ఇడిసిన యిడుపుల యెడలఁ బొడ్రేచనుత్త
రేపగనెంద కోతించ పొవలఁ,
గెడసిన గిరిసెల క్రింద లాఁగలఁ గ్రుస్సి
యదవకాఁపురముండు నాఖుతతుల,
సగము దుమ్మైనఁ బూడి చిగిరింత వామూయఁ
బెరిఁగిన నూతిపాఁతర బొఱియలఁ,
జీమలు ప్రాలీత్వఁ జివికిన వెలుఁగువ
ట్టునఁ బండి యెండి క్రుంగిన గునకులఁ,

తే. బెంటదొగ్గళ్లలోఁ గడు వంటి శ్మశ్రు
చలనములఁ గ్రుక్కు జీర్ణొతువులఁ బొలంబు
దుండుగల మళ్ళ యోరులఁ దూలి తాడు
చిక్కునేతాల పాతలు సీమఁ జనుచు. ౧౩

క. అపమార్గత నరుగుచు మా
ర్గపు ధామార్గావపుఁ గంటకంబులఁ గాళ్ళఁ
విపరీతత నూడ్చుచు నే
రుపున న్వశ్లేష లీడ్చి త్రోయుచుఁ జనుచుఁ. ౧౪

శా. కాంచె న్వైష్ణవుఁ డర్ధ యోజన జటా ఘాటోత్థ శాఖోపశా
ఖాంచజ్జాల చరన్మరుద్దయ దవీయః ప్రేషితోద్యచ్ఛదో
దంచ త్తిక్తకృత వ్రణచ్ఛలన లిప్యాపాది తాధ్వన్య ని
స్సంచారాత్త మహాఫలోపమ ఫల స్ఫాయద్వటక్ష్మాజముఁ. ౧౫

ఆ. కాంచి యాతఁ డొక్క కాలిత్రోవయు నంతఁ
గాంచి యందుఁ దెరువుఁ గాంచినదియ
వరమలబ్ది గానఁ ద్వరితంపుగతి నవ్వ
టావనీజ మంత నంతఁ గదిసి. ౧౬

సీ. ఎలనీటి బొండలంబులు వోలె
మెదడెల్ల జుఱ్ఱి వైచిన డొల్లు పుఱ్ఱె గములు,
నెఱచి గీఱిన జీర లేర్పడఁ దుదముట్టఁ
జీఁకిన నలివచ్చి కీకసములు,
దొనదొన యను నీగెతుట్టెల రూ పేరు
పడక క్రంవలను వ్రేలెడు గరుసులు,
దూళ్ళ మక్కెక్కి మంగళ్ళతిప్పలు రేఁగు
వడువున గాలి నాడెడు నెఱకలుఁ,

తే. దుసిసిన నరాంగకములఁ బొత్తులను గమిచి
పోక యొండొంటితోఁ బోరి పీకులాడు
శ్వాపదంబులుఁ, బదహతి ప్రస్నివలుచు
వరుగు దఱచగు ముఱుత్రోవ నరిగి యెదుట.

సీ. ముంగాళ్ళఁ జాఁగి పై ముచ్చుఁజూపులు పర్వ
బొమిక లెత్తుచుఁ బాఱి పోవు శునులఁ.
బలలితోరణములు పట్టి బిట్టెగయ శా
ఖాధూతి నెగయు కంఠములరొదల.
నడ్డంబు దిరిగి తలాహతిఁ బడి రొండి
హస్తంబు లిడి యంగ లార్చుకవుల,
డబ్బాటుమై నొక్కెడలు నూపి. యవి మాయ
నవగఁ వేతెవఁ జూపు వ్యాపృతులను,

తే. కవి యెవఁడొ యొక్కరుం డిందుఁ గలఁడు, వాఁడు
నరుఁడు గాఁ, డింధనాదికాహరణమునకు
వేళయును గాదు. పొలగాలి పీచెఁ, దెరువు
నెడ, పనుచు జాలిగొని సంశయించువేళ.

సీ. మృతమర్త్యు రెంటాస నిడ్డఁ బాలక నెత్రు
రంజిల్లు పెనబొడ్డు ముంజివానిఁ,
ఖిల్లచీమల వక్షభల్లాతకియొఁ బోలె
నెఱ్ఱిదుప్పటి నొప్పు కఱ్ఱివాని,

వ్యత్యస్త హస్తిమ స్తాభఁ బాయగు గడ్డ
మును దంష్ట్రికము బొల్చు మొగమువానిఁ,
గడుఁదుర్గ నిడు తుట్టెగతిఁ జొంగలోఁ బొందు
రత మించు కఫిలకూర్చంబువాని,

తే. నెఱకుఁదెఱువఁదిఁ గన శాఖ లెక్కజాలుఁ
బ్రేవుజందెంబు గసరి పైఁ బెట్టువాని,
వ్రేలు డగుబొజ్జ గల బూరగాలివానిఁ,
జెంబుతలవాని నవటు కచంబువాని. ౧౯

తే. కంకకన్నులవాని, నాఁకటను బండ
తిట్ల బేతాళికల సారెఁ దిట్టువాని,
నగగరిమవాని, నన్వర్థ నామఁ గుంభ
జాను వనునొక్క ద్విజనిశాచరునిఁ గనియె. ౨౦

ఉ. వాఁడును గంటిఁ బోకు మని వ్రాలె మహీ స్వీటపాళి నుగ్రుగా,
వీఁడును మున్నె పగటి వేళను మానిని యోటఁ, బోరిలో
వాఁడిమిఁ గొంతకాల మిల వ్రాలుట. లావరి యోట, నిల్చి యా
వాఁడిశరంబుచే నడుమ, వాఁ డది ద్రుంపుడు వీఁడు నుద్ధతిన్. ౨౧

సీ. తిరిగిన నడుగులు దెమలక తొమ్మవ్వ
శించి యపస్వలికిఁ జాడించి దాఁటి.
చఱచిన వంచించి చరమభాగమ నక్కై
తిరిగి, తత్క్రియ కగు దృష్టి నిలిపి,
పైబడ్డఁ జనుమున వచ్చ కొడ్డుచునుండు
పిడికిళ్ళ బలిమి లోఁబడక నిలిచి
చొరఁజూచ గ్రుంగి ముష్టుబిగి కోటగాఁ
జొంపీక తిరిగెడచోన తిరిగి

తే. యసుర వధసాధనము రోయు నపుడు గ్రద్దిఁ
తాచి తిర్ధిగిన్నఁ గృతముష్టి దండ నిల్పి

యెతకొలఁది * వెన్కనడ నొయ్య నడిచి యడిచి
మత్పదన్మృతి యాత్మ నేమఱక యతఁడు. ౨౨

తే. తాఁచి పోఁజూడఁ దన రాక్షసీచయంబు
నెల్లఁ జీరిన డిగ్గి వా రేఁగుదేరఁ,
బోయె నదె వాఁడు రాఁరె రారే యటంచుఁ
బాఱి వాడును దానును బట్టికొనుఁడు. ౨౩

క. బంటో తద్దాసరి య
వ్దం బదహతులను గపోణి పోటుల నిరుమై
లం బొడుచుచుఁ బెనఁగచుఁ బో
వం, బట్టి వటంబుఁ జేర్చి వాఁ డిట్లనియెన్. ౨౪

శా. సారాస్వాదనఁ బ్రాణపంచకము తృష్ణం బాసి నంతర్పణ
న్మారించో నసిఁ ద్రుంచి పొంగెడు భవ న్మాండంబు ధారోష్ణ మిం
పారం గ్రోలి, పిశాచి నీదు కఱకు ట్లండీ, నదస్త్రాలకాం
తారాంత ర్నృకపాల కుంభ విగళ న్మైరేయముం ద్రాగెదన్. ౨౫

క. న న్నిం తలయించిన ఖలు
ని న్నే ఋజువిధి వధింతునే యని యార్పుల్
విన్నందఁగ బుసకొట్టుచు
నన్నీచుఁడు దగ వెలువడు నవ్యక్తోక్తిన్. ౨౬

తే. అనియుఁ బాత్రియుఁ దేఁ బంచి యాంత్రవల్లిఁ
గోలఁగగ్గెఁ ద్రోయ నక్కజముతోడ
నొరగి రక్కసుకో దైన్య విరహితముగ
ధర్మ మెఱిఁగించు సూక్తి నాతండు పలికె. ౨౭

చ. విను మొకమాట రాత్రిచర, వేగిర మేటికి? నిన్ ఱుఝుంతురే
యనిమిషులైన? భాజన గతాన్నమ నే నిఁక నెందుఁ బోయెదన్?
బెనఁగక ప్రాణరక్షణ ముపేక్ష యొనర్చుట పాప, మిందు కై
కనలకు, నాకు మేనియెడఁ గాంక్షయు లే, దిది పోవుటే యురున్ ౨౮

* పా, వెనుక నడు మొయ్య

ఆ. హీనజన్మ మఱుట, యెవ్వఁడే నొకప్రాణి
సంతసిలుట, ముక్తి పొంద గనుట,
మేలెకాదె ; శిబియ మేల్పొందెగాఁడె న
శ్వరవుదేహ మిమ్మి వరము గొనుట. ౨౯

చ. తెవు లయినం, గ్రహం బయినఁ, దే లయినం, గర మైన, నాత్మ పెం
దెవు లయిన, న్జలం బయినఁ, దెక్కలియైన, మృగాగ్నులైన, మే
ల్తెవు లయిన, న్వ్రణం బయిన, ద్రాఁచయిన, న్విడుఁ గైనఁ. దీర్చు పే
లవ తను పూరకే చెడ కిల న్గళు నొక్కనిఁ బ్రోచు టొప్పదే. ౩౦

వ. అది యట్లుండె, నింకొక్క హితంబు సెప్పెద, నదియును బ్రాణభయంబున నాడు కార్యవశంవు మాటగాఁ దెలియక, మాధ్యస్థ్యంబుకాఁ దెలిసి, వినుము. వినకున్న భూతహితంబుఁ గోరి యుచ్చరించు మాట కీశ్వరుండైన మెచ్చుఁ గదా ? వ్యాఘ్రసింహ వరాహ వృక జంబుకాది శరారువులయం దొక్క తిర్య క్కవుగావు ; దేవయోనివి. నీకును మాకుంబలెఁ గర చరణ ముఖావఘనం బులు గలవు ; మాటలను మాయట్ల యకర్తవ్యతావిచారంబులు సమానంబ హో మఱచి యుంటి ; స్థావరంబులకంటె. గీటాదులకు, వానికంటె మఱి మృగాదులకు, వానికంటె మఱి పశు పతంగాదులకు, వానికంటెను మాకును, మాకంటెను మీకును, గరణ కళేబరాది పాటవం బెక్కుడు, విజ్ఞానంబును, ఘనం ; బట్టి నీకేంత కుత్సావహంబగు బీభత్స వధ్యావధ్య పథ్యాపథ్య భక్ష్యాభక్ష్య పేయాపేయ వివేకంబులు లేకునికి యుక్తమే ? రుచి గాదు, శుచిగా దీదురాహారం; బిదియు సకల దురితావతంస యగు హింసనొనఁగూడు నది. హింస పరలోకంబునం గదా బాధకంబు, పరలోకంబు ప్రాణాంతంబునం గదా ; చిరస్థిరప్రాణులమగు మాకేం హింసాభయం బనవలదు ; ప్రాణ భయంబు మనుష్యు మగుమాకు నేఁడైన, మీకు మఱునాఁడైన నవలి నాఁడైనఁ మద యుగాంతంబునందైన నిడువు గలుచల నెప్పుడుఁ దప్ప, దంతవత్త్వంబునకుఁ దారతమ్యం బేమి ; మున్నిటనైనను మునుంగుట సరి యగుటఁ బవ్వతంబునకుం బరమాణువునకు నేమి యంతరంబు ? మీఁదు విచారింప వలవదే ? తపోలబ్ధవరాదుల్గం బూర్వంబునం గీర్వాణుల మదం బణంచి హెచ్చిన హిరణ్యకశిపు దశముఖాదులు శతసహస్ర సంఖ్యాక సంవత్స రంబులు జీవించియుం బంచత్వంబుఁ బొంది తారు మున్ను జయించిన జము

జదువులమాట లాడి కనఁ జాల వాకానొక మెచ్చు, నొక్కఁ డీ
చదివిన కూర వింతచవి, చాలఁగఁ, దె మ్మసు మెచ్చు దక్కఁగన్. ౩౫

వ. అని గీష్పతి మతం బవలంబించి, నిజాలాపహేళనపరుండైన రక్కసు కుత
ర్కోక్తులకుం గృష్ణస్మరణంబు సేసి యిందుఁ బొందుపడు ప్రత్యుత్త
రంబుల వీనిఁ గెలఁకిన బుద్ధిక్షోభంబుగా, నింతకంటె నేమి యబద్ధంబులు
వినంబడునో, మీఁదఁ గార్యంబు గల మాకు దీనిఁ గాదనం బని లే, దని
యందంబుఁ గూడ కొని, ఛందోనువర్తనపరుండై, నీచనంన్మృతికి రోసి,
తన్మఖోల్లానంబునకు శబ్దచ్ఛలంబున నంతర్గతంబున సుగతు నిడుకొని నీవు
సర్వజ్ఞుఁడ, నేను నరుఁడ. హీనకులుండ, సనత్య స్తశాస్త్రుండ, నీ
కుత్తరం బీ శక్తుండనే. మద్వచనస్ఖాలిత్యంబులు నహించి దయచేసి నమ్మి
మత్ప్రార్థనంబు గావింపుము. ౩౬

శా. ప్రఖ్యాతుండవు దైత్యులందు మును, పాపైనొక్క నీకా యశో
లిఖ్యన్నేనును జేర్తు, మే యొకఁ డఁదప్పింప, వ్రతం బొక్కఁడే
ముఖ్యంబై యునికింతు, దాని సఫలంబు న్సేయఁగా లేవుఁగా,
'సఖ్యం సాప్తపదీన' మన్మన విథ స్సంగత్య మూహించుచున్. ౩౭

వ. అది యెద్ది యంటేని ౩౮

దాసరి యొట్టువెట్టి తప్పించుకొని కైశికసేవకు పోవుట

క. ఈకుఱఁగటి యీకుఱుఁగుడి
వైకుంఠనిఁ బాడి వత్తు ప్రతమగఁ, దత్సే
వాకృతికదవట నశనము
నీ కౌదు; న్మఖ్య మిదియ నేఁ డగు దుదకున్. ౩౯

ఉ. ఆచు నతండు పల్కు, దరహాసితఁ జెక్కిలిఁగొట్టి లెన్స వం
దించితి వోయి దాసరి, వనిం దెవాటులు గొట్టికొట్టి మే
న్పెంచి విరక్తి దాసరివి, నిన్నుఁగదా యయినాఁడ, వీ మమున్.
గొంచెముఁ జేసి ఖాద్యాటికికోఁ దఁటపోసెదు, మెచ్చితి న్నినున్. ౪౦

శా. ఏరాజ్యంబు నరుండు నోరి కదవో నీబోధ మాలించు ? నిం
కేరాజ్యంబు నరుండు భాసకయి మే నీఁ దాన యేతెంచుఁ ? దీ

పాక వ్వేఁ జననీమియు న్మగిది నీవా రామియుం దెల్ల ; మే
లా రంతు, ల్పలుపల్కు లంత్యకుల, యేలా చింత, లేలా వగల్. ౪౧

తే. అనిన జెవిఁ మూసి నారాయణా యటంచు
నతఁడు నను నమ్మవేఁ బిశితాశి ? యొక్క
శపథమున నమ్ము మని వాఁడు సమ్మతింప
వేనవే ల్సత్యములు వల్కి వినకయున్న. ౪౨

ఉ. "ఎవ్వనిచూడ్కిఁ జేసి జనియించు జగంబు, వసించు విజ్జగం
బెవ్వనియందు, డిందు మఱి యెవ్వనియం దిది, యట్టి విష్ణుతో
నివ్వల నొక్క వేల్పు గణియించిన పాతకి నౌదు నేఁడ నే
నెవ్వధినైన నిన్నదియనేని," యన న్విని బంధ మూడ్చినన్. ౪౩

## దాసరి మరలుట

చ. అతఁడు తదల్పపాపఫల మందుట నుంకము దీఱి పోయి, త
చ్ఛతదళపత్త్రనేత్రునకుఁ జాఁగిలి మ్రొక్కి, రణద్విపంచి యై,
స్తుతికలితప్రబంధములఁ జొక్కఁగఁ బాడి, యసత్యభీకర
ద్రుతగతి వచ్చి, రాత్రిచరుతో వ్రతపూర్తి గతార్తి నిట్లనున్. ౪౪

ఉ. నీ చెఱఁ బాసి, పోయి, రచనీచర, చక్రి భజింప, ముక్తి పొం
దేచెర, యే చెఱం దవులనే, నీక నుండఁగ జూడు, పంచుచో
నేచరణంబు లేయుదర మేయుర మేశిర మేకరంబు, లీ
వా చరణంబు లాయుదర మాయుర మాశిర మాకరంబులున్. ౪౫

తే. అనిన దత్సత్యమునకు నేత్రాంబు లురులఁ
బ్రమద పులకితగాత్రుఁడై పాఱుటసుర
యినుని మధ్యందినపుదెంత దనదు పెద్ద
బట్టతల మించఁ బ్లవుఁ జేరఁ బాఱుతెంచి. ౪౬

## దాసరి బ్రహ్మరక్షస్సు ననుగ్రహించుట

ఉ. కొంతయుఁబోలె భక్తి వల గొంచునె, వాఁడు నిజద్రుమప్రభమీ
హింతవ ప్రాలుపాకలప్ప బేష్యఁగుఁబోలె, నొన లదంగ్రములం

దుండ, రౌద నృమహాగిరులు హోరనఁ, బ్రస్తుతి వ్రాలి, దంష్ట్రికా
దండము లెత్తి వట్టిన పదం, బొకఁ డొక్కఁడ నెత్తి జేర్చుచున్. ౪౭

శా. "ఈసర్వంసహ దేవదానవమహీభృన్మౌనివాదాతప
శ్రీనసర్వస్వము నేతదన్యకృతులం జెప్పంబడు, న్నోర మా
నీసత్యం బురరీకృతాంత, మిల నెం తే వృద్ధనై మంటి నే,
నానత్యం బిఁక నిన్నుఁబోలు కృతసంధా ధూర్వహు ల్లేమికిన్. ౪౮

చ. ఇతరులు నీకు నీడె మఱి? యీవృతి, నీస్మృతి, నీబుతేరిత
స్థితిగతి, నీమురారిపద సేవన జీవనవన్మతిన్, సమా
దృత కలగాన సింధు లహరీ ప్లవన ప్లవభావ భా గురు
శ్రుతి తత బద్ధ తుంబికిఁ గురుంగుడినంబి కృపావలంబికిన్." ౪౯

తే. అనిన నాతనిఁ గౌఁగిట నునిచి పలికె,
వ్రత మొనర్పించి తని భాగవత వతంన
"మోయి రజనీచరేంద్ర నీ యురుకృపాక
టాక్షమునఁజేసి ధన్యుఁడ నైతి ననఘ. ౫౦

ఉ. బాసలు బండికండ్లు, మఱి ప్రాణభయంబున లక్ష నేసినం,
గ్రాసము కృచ్ఛ్రలబ్ధ, ముదుగ న్పసమే? యిది నీక చెల్లె, నో
భూసురవంశ్య. పుణ్యజన పుణ్యజనాంకము దావకీనమే
పో, నమకూరెనింగుణము పొత్తున దైత్యులకెల్ల నంకతన్. ౫౧

చ. కడుపు మహాక్షుధ న్నకనకంబడ న స్వ్రతకృత్యుఁ జేయఁ బో
విడిచితి, వేము జాత్యముగ వేధ విధించిన కూడు మీకు, నీ
యెన నొకకీడు గల్గ, దిఁక నే మనిన, న్మఱి నీకు నాన నూ,
బడలిక దీఱ నిత్తునవుఁ బారణసేయుము మైత్రి గల్గినన్. ౫౨

క. ఈమాట న్నొరపొచ్చెము
లేమికి నీశ్వరుఁడ కరి నిలింపవిరోధీ,
నామెయి మేదోమయ దృ
ప్తామిషములు మెసవు" మన్న, నతఁ డను నార్తిన్. ౫౩

శా. "ఎట్టూ? యిట్టగునయ్య పల్క దయలే? కిన్నాళ్లు నీకూడె యీ
పొట్టం బెట్టి, మహాఘలబ్ధిఁ దనువుం బోషించి యెన్నాళ్ళ కే

నట్టి నొక్కతపస్వి యొక్కవ్రతి రాఁడే, చూడఁడే, తత్కృపన్
బుట్టు న్నీఁగెద దీని, నా నొదవి, యో పుణ్యాత్మ యిట్లంటివే? ౨౪

క. మీవంటి భాగవతులుం
బావనులుగఁ జేయరేని మఱిగతి యేదీ
మావంటివారి కిఁక మా
యేవము వెనుకటివి చూడ కీక్షింపు కృపన్. ౨౫

తే. స్వధితియైనను ద్విజుఁ డిన్న శస్త్ర మైన
సరియకాఁ గాంచనము చేయఁ బరుసవేది,
యీయసాధారణన్యాయ మెన్నఁ గలదె
మాదృశులచోటఁ గదియు భవాదృశులకు?" ౨౬

తే. అనిన దేహార్పణము నొల్ల కార్తిఁ బలుకు
కృపణత కతఁ డభిప్రాయ మెద్ది యనిన,
"నిత్తుఁ దను వంట యనుకంప యే? మదాత్మ
కనఘుఁ బాపుటయే యనుకంప గాక. ౨౭

శా. ఘంటాకర్ణుని మించుకర్మ మొకొ నా కర్మంబు? మౌనీంద్రులం
దుంట ల్సేయఁడె? మాన్పి యీఁడె భగవం తుం డట్టి శ్రీ? యట్టి శ్రీ
కంటె న్భాగవతుండు మించ నొసఁగం గాలేఁడె? యా మేలు నా
కంటింప న్మఱి రాదె? పూజనము గాదా ప్రాణిమే ల్చక్రికిన్." ౨౮

వ. అనిన విని మాతంగుం డాతెఱం గెఱింగిన సంగతం బగు ననిన, నాతం:- "దే నొక్క బ్రహ్మరాక్షసుండఁ, గుంభజానుసంజ్ఞుండ, నుగ్రకర్ముండనై యీన్యగ్రోధం బాశ్రయించి వంచనం బథికపంచజనచర్వణంబు సేయుచుండుదు. పూర్వంబున సోమశర్మ యను భూబర్హిర్ముఖుండఁ, బ్రాగ్జని ద్విజుండఁ గాన దయనీయుండన; యొక్క దుష్కర్మంబునని ట్లైతి. నీవు క్రైటభారిం బాడిన నేఁటి పాటి ఫలంబు సకలంబుగా నాకిచ్చి తేని బీభత్సకుత్సార్హంబగు నీజన్మంబు వేఁగు. నీకు నా రరక్షణంబున నగు సుకృతం బనంతంబు సిద్ధించు, నత్యంత ధర్మసాధనం బగు నిమ్మేను నిల్లునేరు;" ననిన, నమ్మౌని ఘాటలకుఁ గలకల నవ్వి యవ్విష్ణుదాసుం డిట్లనియె. ౨౯

క. "ఇటువంటివి యిట కెక్కుఁడు
నీఁ దిగుడువి యొండ నెన్ని యే, నిదియును నొ
క్కఁటి. యొకనాఁటిద కా దొక
త్రుటి గీతఫలంబు నొసఁగుదునె యిమ్మెయికిన్ ? ౬౦.

సీ. దిక్పాలతను వెత్తి తిరిపతనవుఁదోన
యెన్నిమా ర్లెత్త మీ యేను నీవుఁ ?
గేసరి తను వెత్తి కీటతనువుఁ దోన
యెన్నిమా ర్లెత్త మీ యేను నీవు ?
మాతంగ తనువెత్తి మశకతనువుఁ దోన
యెన్ని మార్లెత్త మీ యేను నీవు?
ధరణీశ తనువెత్తి దాసతనువుఁ దోన
యెన్నిమా ర్లెత్త మీ యేను నీవు ?
తే. సోమయాజుల మెన్ని మార్లగాము, శ్వపచ
ఖగకులుల మెన్నిమాఱులు గాము, పాము
గాములము నెన్నిమాఱులు గాము వెండి
కంసరిపుభక్తుల మొకండె కాము గాని. ౬౧

ఆ. ఊఁతనీరు చెలఁది నేఁతమూటఁయిటి
దూది యెండపసుపు దొట్టియక్క
రంబు మేను, దీని రహిఁ బుణ్య మమ్ముట
కప్పురంబు వెట్టి యుప్పు గొనుట." ౬౨

వ. అనిన దనుజుం డిట్లనియె. ౬౩

క. "సంగీతఫలంబునఁ గో
సంగీ నగమైనఁ దయ పొసఁగ నీవే; మీఁ
మ్రింగినఁగ్రక్కె న్వారిధి
కిం గొఱఁతయె? కొదయె విష్ణుకీర్తన" కనినన్? ౬౪

శా. "ఏలా నొంచెద దేహ మిట్టడిగి? యెంతే దాస మేనం బలం
బో, లీలావటు గీతకీర్తనఫలం బో, నీయెడ న్మున్ను? పా (బే)

తాళప్రశ్నలు మూని మె న్గొనుచు; బేతాళ చ్ఛలోక్తిఁ రుషం
దూలింపం దలఁతేని. పుట్టు మఱి నూ తు ల్ద్రవ్వ బేతాళముల్." ౬౫

వ అనిన పాలకటంక పేయుఁడు పెలఁ గటకటంబడి, కార్యేచ్ఛం గన్నీరు గ్రుక్కు కొని, "కటకటా! కైటభారి కనుంగొనంగ డింగరీలు దయాళువులు గావలవదే? తొల్లి దర్శన ప్రవర్తకుండై వైయాసికంబు లగు సూత్రంబులు వివరించి పిష్ట రశ్మివు నద్వైతవై శిష్ట్యంబుఁ బ్రతిష్ఠించిన లక్ష్మణాఖ్య యోగీంద్రుండు, చిర కాలసేవా సంతుష్టుఁడై నిజదేశికుం డగు పూర్ణాహ్వయుం డనధికారుల కీకు మని విధియుక్తంబుగాఁ దనకుఁ బ్రసాదించిన గీతాచరమార్థంబుఁ, గృపాతరంగి తుండై రంగేశధామ దామోదరనామ చామీకరగోపురం బెక్కి, యచ్చైత్స్వ నంబున నచ్చరించినఁ గురుం డలిగిన, 'దేవా! దేవరయాజ్ఞ మీఱి యే నొక్కరుండ రౌరవంబునం బడుట మేలో? భాగవతపరిషత్తునకుఁ బరమపద మగపడుట మేలో? యని వితర్కించి మీ వుచ్చరించుట గా నుచ్చరించితి' నని తదభినందితుం డయ్యె. నతండ నిజచ్ఛాత్ర నక్త్రింబునకుఁ బ్రత్యహంబును గల్యంబున మూల్యం బొల్లక గవ్యంబు సమర్పించి వేఁడిన వల్లపి వల్లవులకుఁ బరమ పదంబుఁ బ్రసాదించె; నతండ బంధముక్తుం డయ్యు నపతాపాంతరంబునఁ గాలాంతరంబున నంకుచితజ్ఞానులై విషయపరు లగు నరులకుం బరమునందలి టీపొంచవ సుందరజామాతృ నామంబున నర్చ్యాదిగతి విశదీకరించె; నతండ యిటమీఁద యాదవగిరి వెంకటంబు పాషండసంకులంబుగా వచ్చినఁ దచ్ఛ్రుతికి శఠకోపనమాఖ్య సంభవించి నీరంధ్ర వాదంబున సంద్రాదివిషయ విద్వ జ్జనంబుల నధోక్షజవిజయవాద భిక్షవేఁడి దిగ్విజయంబు సేసి గరుడకంధర గుహాకుంత న్యకంఠీరవంబు కుహనాత్రిదండియై బ్రుసీ కుసుంభాంబరాంభః కుండిక లొనంగ నంగీకృతాంతిమాశ్రముండై, ఫణివ కణభు గక్షపాద బాద రాయణ కపిల జైమిని శాసనంబులు మత మహానన మహీసురులు మున్నుగా నెంతేవాసి నంతేవాసులకుఁ దెలివి పఱుపం బరమహంసాసక్త్న పరకాష్ఠయై, పదయుగ ప్రసన్న భువనప్రపంచపంచజనహృదయ భవనంబులం బద్మపద్మా క్షులు పల్లేర్లు దుడిచి పాడెక్కి భక్తి శోధించి భూతలంబుఁ బావనంబు సేయం గలవాఁడు. మఱియు హయవదనపదారాధకుండై వేంకటేశుండను సింకొత్క మనీషి మధుమథనమతప్రతిపాదకం బగు ప్రబంధశతంబు రచించి శిలోంఛ వర్తనంబునం దపంబు సేయం దనకు జరచ్ఛదన శాకాదానంబు సేయు నగ

స్త్రైర్వీరుహంబునకు నిర్వాణంబొసంగం గలం; డిట్టి యేష్యంబులు మదీయ దివ్యబోధనంబున నెఱింగియుందు, నేతాదృశం బగుత్రైకాలిక జ్ఞానంబు కలిమి నిమ్మెను మాననీయంబుగదా యంటేని యది జాత్యంబు దక్కఁ దపస్సత్యశమద మాది లబ్ధంబుగాదు; నిషాది భవిష్యదర్థంబులఁ జెప్పుచున్నది. అది శుచియే? కౌశికంబు దబ్బగాటి గబ్బులుఁగు గౌళి కనుంబెంటి పైఁడికంటి లోనగు తిర్యక్కులు భావిప్రయోజన సూచకంబు లై యున్నయవి; యవి తపస్వులే? యట్ల మావిజ్ఞానంబును; నెట్లనిన, నాస్తిక్యంబువలన శాస్త్రంబులెడ నధీతి బోధంబులు దక్క నాచరణప్రచారంబులు లేమి ధర్మంబు దూరం, బది నిమిత్తంబుగా నిత్తెఱం గెఱుంగక భవోత్తారకంబుగాదు, గావునఁ గలుష రహిత కాయంబునంగాని కల్యాణంబు లబ్ధంబుగాదు. గాఁబట్టి యివ్విరూప విగ్రహం బనుగ్రహంబున నుడివి కృతార్థుం జేయు; మని పాదంబుల వ్రాలి పాటం బాతికపాలేని యీవే యనిన, నతం డదియుఁ ను నీశేనన్నఁ బోని మ్మిప్రభాతసమయంబునం బాడిన చరమగీతంబైన నిచ్చి ప్రసన్నుండ నగు న న్నవిపన్నుం జేయు"మని లేవకున్నం బరమదయార్ద్రుండై, 'యట్ల కానిమ్ము లే' మ్మని యతని లేవనెత్తి. యత్తన్ప్రాప్తి ప్రకారంబు సవిస్తరంబుగాఁ జెప్పు మనిన నవధరింపుమని యప్పొలదిండి దుఃఖార్తుండై యిట్లనియె. ౬౬

## ఆశ్వాసాంతము

మ. అజ చౌర్యాపహృతాత్మ తోక సముదాయాభీరకాంతామణీ
వ్రజగోరాజిమనఃప్రమోదకర తద్వత్ప్రాప్త రూపానురూ
వ జనిప్రాభవ, ద్రోణిజోదరకన ద్బాణాగ్ని వృత్తి ప్రకో
వ జలాసార. సరోజ బాంధవ శశి ప్రాంచ ద్విశాలాంబకా! ౬౭

క. అనవరత నవ రతాదృత
వినుత ప్రేమాత్తవల్లవీజనజాలా,
మననపర మౌనిమానస
వన వసిత్ర మరాళవర, సువాసితమూర్తీ. ౬౮

ఉత్సాహ. నలముఖాది చక్రవర్తి నాథ వనసమర్పితా
త్యలఘుమకుట ముఖ్య హా ర్యుపాయనా, యనావిలా

జిల సురారిహరణ నిజ వశీకృతాఖిలాంత ని
ర్మలగణా! యమేయరూప రంజితార్యపోషణా. ౬౯

మ. ఇది సైతామన యాపనావని ధవాహీనాభ్రచుంబి స్ఫుర
ద్విదితాభీల మణీగృహాళిదళనో ద్వేలోగ్ర హస్తి వ్రజో
ద్య దనీకాగ్రగ కృష్ణరాయమహిభృ త్సంజ్ఞాస్మదాముక్తమా
ల్యద నాశ్వాసవరేణ్య మాఱవది హృద్యంబైన పద్యంబులన్. ౭౦

షష్ఠాశ్వాసము సమాప్తము

—:o:—

శ్రీరస్తు

# ఆముక్తమాల్యద

## సప్తమాశ్వాసము

శ్రీమదుమాసులఘాంగక
సామజహర నక్ర దళన చక్ర సదాశ్రీ
క్షేమంకర చరణాంబుజ
హైమోజ్జ్వలవాస! వేంకటాచల రమణా! ౧

### బ్రహ్మరాక్షసుని వృత్తాంతము

వ. అవధరింపు మప్పొలసుసెంది దుఃఖార్తుండై యిట్లనియె. ౨

ఉ. ఉండుదుఁ జోళభూమి నొకయూరఁ గళల్ పదునాల్గు నేర్చి, వా
క్చండిమఁ జర్చ గెల్తు ఘటశాసుఁ, బ్రౌఢునిఁ దప్పు పట్టుమన్,
ఖండలమష్టి విప్పఁగని సర్వము, నెంచి ప్రయోక్తలన్ సుధీ
మండలి గ్రాంథికత్వ మనమానసు నేయుదు జల్పవాదినై. ౩

వ. ఇన్నువపడిం బ్రభిన్నగండం బగువేదండంబుపంబోలె మదాంధుండనై, యల్పవిద్యాలబ్ధి విడువ ముడువ వేనరని పిసనంబుగల రెడ్డియుంబోలె, సద్వ్వదువె పరబ్రహ్మంబై, పెద్దలంజెనకి యోడియు సరియైతి ననియును, సరిపోయి జయించితి ననియు, నబద్ధంబు లాడి చిల్లరప్రభువుల భ్రమియించుచుండి, దీక్షితులం జూచి యియ్యకవోవమి ద్రవ్యభిక్షార్థినై పథురకుం బోయి యప్పురంబున.

సీ. బహివద్ధద్విజున కల్పపుఁ జాచితం బిడి,
పనిఁడికై తా వాని బంతిఁ గుడిచి,
కలసి వణిక్పురోధలతోడఁ బుణ్యాహ
ముల బియ్యమునకు నై మొత్తులాడి,

శశి రవి గ్రహ జపస్నానాదికము లెల్ల
దొరలవాకిండ్లకే దొద్ద యిచ్చి,
పచ్చిత్తితో ల్పట్టి చ చ్చాలమెట్లంది
కొనఁ దాన యూరెల్ల గుత్తపట్టి,
తే. దర్పపోటులఁ దిని, లేని తఋణ మైత్రి
నంటి పితృశేషము భుజించి, యదియు నెడల,
నక్కవాదల నరకూళ్లు మెక్కి, మీఁద
పీనిశేఖర మొక థులార్త్వ్యజ్యము కొని.

ఉ. ఇట్టొనఁగూర్చి వైశ్యునకు నిచ్చి, చన న్మతి వుచ్చి, చొకము
ల్వెట్టుచు, వడ్డిలెక్క లటు వెట్టుచు, ధారణవానికై కొదల్
వెట్టుచు, వాఁడు రేఁగి మఱి 'పెట్టుదుఁ బెట్ట' ననంగ, మిట్టఁ గూ
వెట్టుచు, నిట్టు పోరఁ, గనిపెట్టుచు, నొక్కరుఁ డుండి వెండియుఁ౯.

సీ. వెలివాడఁ బనిక్రొత్త మలకడాల్గొని నూనె
యిడి తంగెడాకు గట్టెడు తహతహ.
కూర్కుఁబు గొరిగించుకొని యష్టతోయంపు
టంగడిఁ దలగడగాదు తడవు,
వంట పూఁటింటి కెప్పంటికంటెను బాలు
పెరుఁగు నే గూర లంపెడు తెగువలు,
నంబెళ విదలించి తాంబూలదళ పూగ
నివహంబుఁ జాలఁగ నించు సుబ్బు,
తే. బ్రహ్మచారిభుజంబు మాత్రకు నడింపుఁ
బ్రాలు, నాలికి మేలుచీరలు. గొనియెడు
సంభ్రమంబును, బెఱపాంథజనులఁ బయన
మడుగు ప్రశ్నలుఁ, గని మత్ప్రియాణ మెఱిఁగి.

క. హత్తుకొని యొక్క కొందఱ
సత్తెరువుం గట్టఁ బనిచి, యందఱుక్రియఁ దాఁ
దిత్తి యొకటి, గొని త్రేణి మ
ఋత్తర ముత్తర మటంచు నొక ప్రొద్దుకడ౯.

తే. లేచి పోవంగఁ దత్తఱ మేచి తోడి
వారు నన నేను ముడెమోపు వటున కెత్తి
పోవ వాఁ డిందు రంతని త్రోవ యడపఁ
బెట్టి యొకవాఁగు డిగ నీల వెట్టుటయును. ౯

క. ఆఱచేత వ్రాలు గను న
త్తఱిఁ బడె నొకయంపకట్టె, దానికి నిలువం,
బిఱుబిఱ్ఱున ఱాలుపడెం
దెఱపియుఁ గనలేమి సాతు దిరుగఁడఁపడియెన్.  ౧౦

మహాస్రగ్ధర

కవిసె న్గల్పాంతజంతు గ్రసన భృశ బుభుక్షా త్వర త్ర్యక్షి పార్శ్వ
ప్లవమా నోత్పాత [1] బేతాలకల వడిమ హాలాహల స్పర్ధి హేతి
చ్ఛవి రేఖానేకరాహూ చ్ఛలిత పవులు రక్షశ్శ్మశానజ త్పుళింద
ప్లవబృందంబు ల్వనివ్యల్వడిఁ బొలుపొందు మన్పుల్కులు న్మల్కులు గ్రాల్.౧౧

వ. ఇట్లు చెట్లు వెడలి విఱ్ఱవంచుకొని ముంచుకొను నన్నల్లప్రజం జూచి
హల్లకల్లోలంబై విఱుగంబడు నెడ. ౧౨

సీ. పనలేదు నిలరోయి పాతకులారవి
దేహాయుధంబులు డూవువారు,
పైఁడి బానము జెట్లఁ బడవైచి దుడ్డుపె
ట్టకుఁ బాఱుచునె యొలె ల్మెచువారు,
బరువు డించి కటారి పరుఁజించి నిల్చి యిం
దెందు వచ్చెద రని యెదురువారు,
వస్త్రంబుఁ గొండు దేవర యోయి యిది చన్నఁ
బన్నసి దయపుట్టఁ బలుకువారు.

తే. కలవి మామూత నిప్పింతుఁ దొంగసుఁ, గొకటి
యాఁడుదాని జే నంటకుఁ డనుచుఁ బెద్ద

---

[1] పా. భూతప్రకర

తనము నభిమానమును దెంపు గనఁగ బలికి
సిలిపి దోఁపిచ్చువారు నై తొలఁగి రపుడు. ౧౨

సీ. తొడువిండివాఁడు సన్త్రోపఁ బోవక యెదు
ర్పడుశాంత్రఁ దొడిఁబడఁ బదరి పొడిచి,
తినుఁ గీక పెనఁగినఁ బెద్ద నొంపక యెట్టిఁ
బాతించి చేఁ గలవాని నాఁచి,
యాయితంబై చించి యరిగెదువాఁ దేటు
నకు మీటి చన్న వెఁజ దపులు కుడిగి,
పొదవు చే లేకయ పుటపుటయాను నైన
'వాని శోధింప నవ్వలిక్కిఁ బనిచి,

తే. పొసలఁ మాశిన నీఁపె బాఁపుం పెకల్చిఁ,
గట్టుబట్టలు గొని ప్రాఁతబట్ట దయను
గోఁచులకు నిచ్చి, గనవరాకులు నిగిడ్చి,
చెప్పుటట్లు శోధించి సిగలు విప్పి. ౧౪

వ. ఇట్లు పాంచ్చరులు పెచ్చుపెరిగి విచ్చలవిడి నుచ్చావచంబుగుసా ర్థంబు
నర్థంబు లపహరించు సంకులంబున. ౧౫

సీ. కటినుండి చనుమలు గడి గాఁగ బిగియించి
కట్టిన నిడు నీలికాసె మెఱయఁ,
బిల్లిగడ్డము మించఁ బెరిఁగి మీసలు కుక్షి
గోళంబుమీఁద నుయ్యాల లూఁగ,
బూఁది బ్రుంగిన మొగంబున గొదకిట్టు మై
నవుమైల ప్రాఁబొతు నాఁజెలంగఁ,
జిటిబ్రవేలి పూసపై ఘటియిల్లు వెతఁబట్టు
చిమ్ముల నురియ దా ల్మమ్మరముగ,

తే. నూరనుండియుఁ గనుపెట్టుచున్నవాఁడు
దప్పిపో నన్ను తల్పాటు దాఁ బొడగని
యట్టివేళఁ గాకశ్మశ్రు వనెడు నొక ప్ర
చండ చండాల చోరభటుండు దఱిమి. ౧౬

వ. కయ్యంబునఁ బాఱఁ బాఱ గాయంబు సేసి వెఱపేఁకిఁగొలిపిన కాకశ్మశ్రుఁడనాదు ధేనుచండాలు కరాళవేషంబు గన్నులం గట్టినట్లుండఁ గడఁ గనుట నిట్టి కరాళవేషంబు గలిగెఁ; గైశికీగాన ఫలదానంబున దీని మానుపవే? అనిన నతం డేను ఫలంబెఱుంగ, ఫలంబు పరమేశ ముఖోల్లాసంబు, యాజ్ఞాకైంకర్యంబులకు ననుమతి కైంకర్యంబులకు ఫలపరిమాణగణన ప్రపన్నుల కెక్కడియది? కాన బాధకంబగుట ఫలం బింతంత యందుఁ గొంతఁ గొమ్మనవెఱతు, భగవతుండ రక్షించు, నూఱడిలు మన్న నన్నోరిమాట నోరన యుంత నతండు. ౨౨

సీ. స్నిగ్ధత్రిభాగ ముండిత శిరశ్శిఖతోడ,
హేమధవళోపవీతములతోడఁ,
బుణ్యకృష్టద్విత్రయోర్ధ్వపుండ్రవల్లులతోడఁ,
దులసికాబ్జస్రగావళులతోడఁ,
గౌపీన కటిసూత్ర కాషాయయుగితోడ,
జలపూర్ణశుభకమండలువుతోడఁ,
బాణిస్థ దివ్యప్రబంధసంపుటితోడ,
నుత్తరవాక్పూర్వకోక్తితోడఁ,

తే. బసిఁడిజిగితోడ బ్రహ్మవర్చసము వొల్చు
భాగవతలక్ష్మితో ధూమపటలినుండి
వెడలు శిఖవోలె నమ్మేను వెడలి చూడఁ
జూడ వైష్ణవుఁ డై నిల్చె సోమశర్మ. ౨౩

వ. ఇట్లు భాగవత పరిచయ ప్రభావంబున బ్రాహ్మణ్యంబెకాక భాగవత శ్రీయునుం గలిగి యుప్పొంగి యిరుమడియగు చందంబునం బరమహర్షభరితుండై స్వరూపానురూపంబుగా నతనికిఁ బూజఁ గావించి. ౨౪

సీ. జయ దురుత్తరణ సంసారాబ్ధిదళ నీర,
జయజయ గాయక సార్వభౌమ,
జయ శౌరి గాథా రసజ్ఞ పుణ్యరసజ్ఞ,
జయజయ తత్త్వసంభవ్య పవిత్ర,

జయ జనార్దనాధీన జని సంగ పంచక
జయజయ దేశిక చరణ శరణ,
జయ యుక్తవాక్ప్రతిష్ఠా తృణీకృతదేహ,
జయజయ భగవదాజ్ఞాకృతిస్థ,
తే. జయ సకలజంతు సమచిత్త జయ దయార్ద్ర,
జయముకుందాన్యదేవతా శాస్త్రబధిర
జయచతుర్ద్వయభక్తిలక్షణచితాంగ
జయ మురారిప్రపన్నాంఘ్రి జలజమధుప. ౨౪

వ. అని ప్రస్తుతించి ప్రదక్షిణంబు గావించి పునర్భవభయంబున భవన దారాత్య ప్రముఖ సుఖ విముఖుండై బదరీవనాదిపురుషోత్తమాధిష్ఠిత పుణ్యభూములం బౌనఃపున్యంబుగం దీర్థయాత్రఁ జరించుచుఁ బరమనిర్వృతిం బొందె, నిప్పుణ్య కథ వహనసమయంబునఁ గిటినాధవరాహంబువలన మహీమహిళ మదీయ పూజోచితోపచారంబుల విశేషఫలదంబు గానంబ యన విని వైష్ణవియగుం దాఁ గావున దదాకలన కుతూహలంబునం గూఁతురై సీ కొదవి యహరహంబును విప్రలంభదంభసమీరితాగాధ గాథార్థసమేతగీతరసంబునం బ్రొద్దుపుచ్చుటగాని వేఱొండుఁగా దేమి తపంబు సేయుచున్నదియో యంటింతకంటెఁ బరమ తపంబున్నదే? యన్నియును మేలయ్యెడు, శ్రీరంగంబునకు రంగేశు సేవింపఁ దోడుకొనిపోయి రమ్మనుటయుఁ, బ్రసాదమ్మని ప్రణామమ్ము సేసి వసిందిపల్లకి నబ్బాలికారత్నంబుసునిచి పరిచారికాశతంబును భాగవతపరిషత్తునుం గొలవఁ బ్రయాణపర్యాయంబులఁ బరమానురాగంబునం బోయి. ౨౫

## గోదాదేవి శ్రీరంగమున రంగనాథుని సేవించుట

మ. చని కాంచెన్ విరజాభిధాంతర వపు స్సహ్యోద్భవాతీర సం
దనవాటీ వలయద్రుమావళి దళాంతర్ధృశ్య పాపాళి భం
జన చాంపేయసుమాయమాన విషమస్వర్ణావృతిప్రాత ర
శ్మి నభస్స్పృక్శిఖరాళి దీపకశిఖా శృంగంబు శ్రీరంగముం. ౨౬

క. పాళీ హల్లక చిత కచ
పాళీ పాళీభవ ద్విపంచీ స్వన భృం

నింగి నీరెండఁ గాయు వేదాంగు వినత
సుతుని నతిఁ గాంచి మగఁడఁ దన్నతియుఁ గాంచి. ౩౩

వ. ఆతనిచే విజ్ఞాపనంబు సేయించి యనుమతింగాంచి చతుర్భుజులు జలధర శ్యాములు శతపత్త్రలోచనులు చపలాపిశంగవసనులు వనమాలికాబద్ధబాహుమధ్యులు నైన మధుమథన ప్రతిబింబంబులం బోని పారిపార్శ్వికులఁ బరాంకుశ ప్రభృతిముక్తుల సేవించుచుఁ దదనంతరులై చని మహావకాశంబును మణిమయ స్తంభ సంభృతంబును శాతకుంభకుంభశోభిత శిఖరంబునునై చిత్ర నేత్ర వితాన లంబమాన నానాప్రసూనదామ ముక్తాగుళుచ్ఛాచ్ఛచామరంబును నుద్వేల కాలాగరుధూప ధూపితంబు నగు మహావిమానమధ్య విధుకాంతవితర్దికాతలంబునఁ జరణముఖ తత్త్వత్రితయాధిష్ఠిత ధర్మాధిసూత్రపరిషదాత్మకంబును దేజోమయంబును నగు విపుల విమల పీఠంబునఁ బరిమళాలోలరోలంబజాలంబగు నంబురుహంబు జాంబూనద త్వక్సుత్తమసువిస్తీర్ణకర్ణికాపరిధి సూర్యపాథోనిధానంబునకుఁ బ్రథమ హేతుభూతంబగు భూతశక్తిత్రయంబు బోలెఁ బారద స్ఫటిక బహుళ పాండురుచి పుండరీకంబుల పసుపు మసమసక లెనకొల్పు మినిమి గల భోగిభోగ భాగంబునకుం బరభాగంబు మిగులఁ దదాత్మకంబ యగు నుపబర్హంబున మహార్హకేయూరమణి స్ఫురంబగు కూర్పరం బూని మననవర మునిమనోరాగరస మార్జనంజేసి ముగుల నరుణిమ వహించెనో యనఁ జాలు కెంగేలు కపోలంబునం గదియ త్రిదశ తరు కుసుమ కంచుళిత కంచుకితంబు కాత్మకంబగు దుకూల విశేషంబున నొత్తిగిలియున్నవానిం, గరింగఁ బకటింబెట్టి బిట్టు దనచేతి చక్రంబునం దెగిన నక్రంబు పూజ్యంబగు సాయుజ్యంబు నొందెనో యన నువరి పరిస్పృశ్యమాన గండస్థలస్థ మణిమకరకుండల ప్రతిబింబ రుచి డంబరంబునం బరమ సౌందర్య మకరందనిష్యంది యగు ముఖారవిందంబున నందంబగు వాని. నిర్నిమేషదృష్టి నెట్టుకొని చూచుతఱి నీలావదాతయు తెప్పవట్టు తఱి రొట్టెదరొక్కను కలధౌత గౌరగౌర మహామహఃపూరంబున మునింగి దుర్నిరీక్ష్యయు నగు విజరుచిర మూర్తివలనఁ దనదు సాకార నిరాకారతలు వారికిఁ జూపు రూపున దీపించు వానిఁ, గళత్రంబులగు శ్యామాచ్ఛాయలచేతఁ బ్రేమునం బొమవంబడిన యట్లు కవ్వలు దొంగలు నగు వక్ష్మకాలిం, ల నొవ్వ సోమ సూర్యాత్మకంబు లగు వెడంద నిడువాలు బెళుకు నెరల కన్నులం గ్రేవ మిస్మిత్త్రేక్షల వెదఁజల్లువాని, మంకెన విరి బింకంబు

నింకించు నధరశోణిమ నెపంబున వెలుంగు ముఖజనితపవతాళనుతోఁ దత్సఖుం డగు గంధవహుం గూర్చి నిక్కెనన నొక్కించుక నిక్కి చొక్కపుఁ బొటమలఁ జూపట్టి తిలకుసుమ విలసనాపహాని యగు నాస భాసమానుం డగు వాని, నుదరజాత శ్వేతధామతామరసంబుఁ గనుఁగొని మహదాశ్రయంబు గనిన పూర్ణిమాశశాంకుఁడను శంక నాతనికి నాకు వైరంబు మాన్పు మని తత్సహోదరిగావున రత్నకాంచనంబులు లంచంబులుగా నివేదించి యడుగు లొత్తు నిందిరకు వరముం బడియున్న రాహు నసం గేయూరకటక మణి ముద్రికాంకితం బగు దీర్ఘ బాహు పరిఘంబు కటితటోత్సంగంబున మెఱయు వాని, నురఃస్థల న్యస్త నిస్తులాస్తోక కౌస్తుభ గభస్తి మండలంబున నిండోల గంబుండు పుండరీకనికేతన తనుచ్ఛాయ యన నచ్ఛచ్ఛం బగు శ్రీవత్సంబున లోచనోత్సవంబుఁ గావించువాని, విజితమృగనాభి నాభిసౌరభ్యంబునకు నెఱయు నుత్తుంగ భృంగ మాలిక యన మెఱయు నసిత పేశలతులసీపలాశ దామంబున నభిరామ కోమలాలంకృతి యగువానిఁ, గపట కరటి విరోధియై యసుర యనుఁడుం గొని మగఁడ మనుజాంగంబు నంగీకరించునెడఁ దలంపంబడమి నట్లనయుండె నన బడుగగు నడుము పసఁ గడునొడిక మగువాని, ఘనజఘన చరమేతర ధరాధరాధిత్యకాతలంబునం గాంచన కాంచికామణిమకుట గగనమణి గాయు నీరెండ మెం దనంబరఁగు మెఱుఁగు పీతాంబరంబునం బొదువంబడి దాని సన్నదనంబునఁ దన నున్నఁదనంబు వెలువలం దోఁపఁ గనక పుష్యరాగంపుఁ దెరవారు వైదూర్యమణి స్తంభ యుగంబునుం బోలెఁ గించిదామీలిత నీలిమం బగు నూరుయుగళంబు వానిఁ, త్రైవిక్రమం బగు విగ్రహంబుతో నాగ్రహంబున మీఁదికిం జూఁచు తటిఁ జంక్రమణరయంబునం దగిలివచ్చిన మణిమయస్వర్భువన జాంబూనద ప్రాకారవలయంబనం దీండ్రించు నుద్దండ గండపెండెరంబునం బొదమ నఖాంత ప్రభామండలంబునం బరిహాసితంబులై మత్తిపండుల వరువుగల మతముల బెడంగుపడి బావి నిజ కమరాపటార సూచకంబులుం బోలెఁ గొదమ తామేళ్ళ మేళ్ళనగు మీఁగాళ్ళతోఁ గోకనద మృదూదరంబు లమర మెఱుఁగు ఱుక్కలం జిగి మొక్కవఱుచు నఖచక్రవాళ చంద్రికల భక్తజన మనస్తమోవిదళనంబుఁ గావించుచు హలకులిశ కలశ కమల మకరాంకుశాంకితంబులై లక్ష్మీకుచ కుంకుమాకలన నరుణారుణంబు లగు చరణంబులం దాపత్రయాపహరణంబు సేయువానిఁ, నారాయణుం

పురాణపురుషుఁ బురుషోత్తముఁ బ్రణతార్తిహరు వాసుదేవు హృషీకేశు నీశస్తుతు విభీషణవరదు ననంగజనకు రంగరమణుం గాంచి సహ సమాగత భాగవత పరిషత్సమేతంబుగాఁ దానుం దనుజాతయుం బ్రమద భయ భక్తి రసమగ్నలై జయజయ శబ్దంబులతో సర్వాంగాలింగిత క్షోణీతలంబు లగు నమస్కారంబులు గావించి నిలిచి నిటలతటఘటితాంజలియై యిట్లని నుతి యించె. ౩౪

తే. విధిగృహాంతఃస్థ విత్త సేవధికి శరణు
చిరకృతేక్ష్వాకుపుణ్యరాశికిని బ్రణుతి
దనపతిభ్రాతృకులదేవతకు జోహారు
నతమృడాదిక సుమనస్సుకు నమస్సు. ౩౫

తే. కొలుతు సర్వేశు సర్వాత్మకుని ననంతు
స్వప్రకాశు నభేద్యు సమస్తలోక
సముదయాధారు నఖసమూహములకును న
జేయు నిన్ను నిరాధారు నిత్యు సత్యు. ౩౬

క. నారాయణు భూ ప్రవృతిక
గౌరవవ ద్వస్తువితతిఁ గాంచె మిగిలి పెం
పారు గరిష్ఠత గల పర
పూరుష శరణంబు వేఁడి పొగడెద నిన్నున్. ౩౭

తే. అజశివాదిక మగు నీసమస్తజగము
నెందుఁ బ్రభవించు వర్తించు డిందు నట్టి
మహిమ కిమ్మైన నిత్యు నమస్తభూత
మయుఁ బరులకంటెఁ బరు మహామహునిఁ గొలుతు. ౩౮

సీ. పరపురుషునికంటెఁ బరుఁడనాఁ జనువాని,
పరమాత్మ. ముక్తికై పరమయోగి
పరిషత్తుచే సదా భావింపఁబడువాని,
నెవ్వనియందుఁ బ్రాకృతము లైన
సత్త్వాదిగుణముల సందడి లే దట్టి
విమలుని, సర్వభూతములకంటె

సాధ్యుఁడు శుద్ధుండు నగువాని, విభుఁ, గళా,
కాష్ఠానిమేషాది కాలసూత్ర

తే. మయిన యెవ్వానిశక్తి యింద్రియవితతికి
గోచరము గాదొ నిర్లేపుఁడై చెలఁగఁగ
నతివిశుద్ధుఁడు దానయ్యు నౌపచారి
కస్థితిఁ బరమేశుఁ డగు నిన్ను విష్ణుఁ దలఁతు. ౩౯

వ. అని పరస్వరూప సురసేవ్య భవ్య దివ్యావతారలీలలం బ్రస్తుతించినఁ గౌస్తుభాభరణుండు కరుణాతరంగితంబు లగు నపాంగంబుల నమ్మునిం గనుంగొని కుశలప్రశ్నంబుఁ గావించి కంకణాలంకార క్రేంకారంబు లంకురింపఁ బదపంకజంబులకు, గుసుమాంజలులు సమర్పించు సకలసీమంతినీసీమంత ముక్తామణి యగు నాముక్తమాల్యదరూపు నెలఁతబాయంబు సాభిప్రాయంబుగాఁ జూచి తనలోన. ౪౦

సీ. దీనిమోము పసచెక్కుఁ గానెకా సిరిపట్టి
కిని బోర పసుపుఁజెక్కెంబు గలిగె,
దీనికౌ నల్లారఁ గానెకా గర్వించి
యుర్విఁ జైత్రునకుఁ గాలూఁద గలిగె,
దీనిపాలిండ్లుబ్బుఁ గానెకా రతి చేతి
కిన్నెరబ్రోఁతకు వన్నె గలిగె,
దీనిమోమొప్పారఁ గానెకా వాణి రా
యంచలేమకుఁ గలాయంబు గలిగె.

తే. దీని వెన్నెఱు లేపారఁ గానెకా ప్ర
పోషితమయూరికి విరాలి పొంపఁ గలిగె
దీనియడుగులు రంజిల్లఁ గానెకా వి
పానఁ బడుతేఁటులకు మెట్టపంట గలిగె. ౪౧

తే. అనుచు నువ్విళులూరి మురారి తమక
మాఁపలే కాత్మ దివ్యశుద్ధాంతసీమ
కన్నెలఁతఁ దార్చి యొక్కమాయావధూటి
నట్టి శాపంబు వారున్నదనియ యుండ. ౪౨

వ. పూజకులచేఁ బావతీర్థప్రసాదపరివేష్టనంబు లిప్పించి విడిది కనిపిన గుడివెనలి కాంబరీతనుసంభవం బాలకిం బెట్టి గృహంబునకుం జని పంజరంబు సతలించి యచ్చంచలాక్షిం గానక.

శా. అబ్రహ్మణ్యము! లోన వైచికొనె నన్యాయంబున న్మత్సుతం దా బ్రహ్మాదుల మేర నిల్పియుఁ బ్రభుత్వం బూఁదియుం దోఁతురే యీ బ్రక్కాణ ద్విజుఁ జూత రయ్య సభవా రీరంగభృత్తంచు దుః ఖాబ్రాశిం బడి బాష్పకంఠుఁడు సముద్యద్ధోషపలాలుఁడు నై. ౪౪

శా. అంతే వేడుకయైనఁ బెండ్లగుట కీ నా, దేహము న్ప్రాణముల్ సంతానంబు నిశాంతము న్ధనము నన్యంబు ల్పతు క్రేణు లే కాంతన్స్వస్వకనార్చనంబునక కాదా కూర్చుటే, మీ, కయో వింతే, యీ బుడు తెంత. న న్గుణుచఁ గావింపం దను న్మెత్తురే! ౪౫

చ. శివుఁడు విరించి వాసవుఁడుఁ జెప్ప నశక్తులు, కొల్చునట్టి వా రవుట, నిరంకుశుండ వని యక్కట పాడిఁ దొఱంగఁ జెల్లునే! భువనములెల్ల నీ వయినఁ బొంత దయానిధి యమ్మ లేదె? భా గవతులు లేరె! నా కొఱకుఁ గాఁగ వహించుకొనంగఁ గేశవా. ౪౬

ఉ. నెట్టన యల్ల లచ్చి యల నీళయు భూసతి యుండ, నీకు నీ నెట్టిక నీలపై మనవు నిల్చుట కే మనవచ్చు? వెఱ్ఱి యో నట్టుగఁ బేద నన్నుఁ బరిహాసము సేఁతకుఁ దక్క, వింత భూ పెట్టిదె? దిద్దు నెవ్వఁ డిల నేలులవంకలు వారిదొంకలున్. ౪౭

వ. అని యిట్లు ధరణీసురుం డదవేట్ట భాగదతక్షోభంబునకు భువనభర్త యు భయంపడి తద్భాందనంబునకుఁ గేలిసేయు చున్నవాఁ డను భావం బకనిశిఁ దోఁప మకరకుండలమండితంబు లగు గండదర్పణంబులం జెలువ వ్వెలర్ప నిట్లనియె. ౪౮

చ. ముది మదిఁదప్పితో టు మునిముఖ్య! భవత్తనయ న్గృహంబునన్ బదిలము చేసి వచ్చి మఱి బట్టబయ ల్వెదదూరు దూరె, దా నదన మిఁ కొక్కమా టరసి చంచలలోచనఁ గాన కున్న దూ రెదు మఱి కాసి, బుద్ధివిపరీతతఁ బొందక పోయిమూసుమా. ౪౯

తే. అనిన సాతంత్రియ యాయెనే యనియె నేమె
యుంగ మే యార్తిఁ గడవు చల్లఁగఁ బలికి
కరుణచేసితి విజయివి గమ్ము పంచు
బాష్పజల మాఁగి యింటికి, బరువువాఱి ౫౦

ఆ. మ్రొక్కినట్టి తనయ మూర్ధంబు మూర్కొని
ప్రమదబాష్ప పూరుల బ్రాహ్మణుండు
చేత వెన్ను నిమిరి నాతల్లి నినుఁ గంటిఁ
గా యటంచు నింటఁ గడపనింప. ౫౧

తే. రంగపతి బ్రహ్మ రుద్రుల బ్రాహ్మి గౌరిఁ
దనకుఁ దక్కన్య నడిగింపఁ బనుపుటయును
వారు సేనేశ సహితులై వచ్చుటయును
విష్ణుచిత్తుఁడు సంభ్రమాన్వితుఁ డగుచు. ౫౨

వ. విష్వక్సేనపూర్వకంబుగా వినయంబున నాతిథ్యంబు లొనంగి యుచితాసనంబుల నాసీనులై యున్నవారి యాగమనప్రయోజనం బడిగి తెలిసి ప్రమదరసభరితాంతరంగుండై యిట్లనియె.

## గోదాదేవి శ్రీరంగనాథుల వివాహము.

క. ధన్యుఁడ నైతిం దన కీ
కన్యక నీఁగాంచి భృగువుగౌరవముఁ బయో
ధిన్యాయము నొందవె నిదే
సన్యాయంబే? చమూవ హర విధులారా. ౫౪

క. వినుఁ డీఁ దగు సంబంధపు
టెనయికఁ గని మోచి తెచ్చి యిచ్చె ననరె చ
ల్కని నరులు; గాన మావుర
మునకు స్వేజయంబు చేయఁ బుత్త్రిక నిత్తున్. ౫౫

తే. ప్రభుతఁ బరమేశ్వరుం డైనఁ బత్త్రివన్న
జనమున కొనంగు మీకు నీ చనవు. శౌరి

తానె కట్టినభూమికఁ దాల్చు మాకు
ఘనత యిడి మమ్ముఁ జేయుట తనదు ఘనత. ౨౬

తే. అనినఁ జని విన్నవించ దయారసార్ద్ర
చిత్తుఁడై విశ్వభర్త పక్షిప్రధాన
పౌపవాహ్యంబు నెక్కి బ్రహ్మాదిసురలు
బలసి తమతత్తడుల నెక్కి కొలిచి రాఁగ. ౨౭

క. నాసీరుఁ డగుచు సూత్రవ
తీసఖుఁ డుడుపీథిఁ బోఁజుఁ దీర్చిన వ్రజ భూ
షాసి శతకోటి శతకో
టి సవితృప్రభలు దిశల దెప్పర మలమన్. ౨౮

వ. శ్రీవిల్లిపుత్తూరికిం జని విశ్వకర్మ మణిమయంబుగాఁ గట్టిన విడిది పట్టున విడిసి యయ్యాదిమవరుండు దివ్యాప్సరసలు హరిద్రాదికస్నానీయ మంగళ ద్రవ్య మండనం బొనర్పఁ బెండిలికొడుకై దివ్యవాదిత్రంబులు నారదాది దివ్యముని గానంబులు వెలయం గలధౌత ధవళ ధారాధరంబులు గురియు సుధాధారల నభిషిక్తుండై ముక్తావళీ కౌస్తుభాముక్త కంబుకంధరుండును కేయూరకంకణా లంకృతుండును మకరకుండల మకుటాది భూషావిభూషితుండును దివ్యాంగ రాగ రూషితుండును పీతాంబర సంవీతుండును దులసీకల్పితరు ప్రసవప్రస గాశ్రితోరస్కుండునై యుండు నంత, నక్కడ నటకు మునువ గృహప్రవే శంబు నేసి సంభ్రమాయత్తుం డగు విష్ణుచిత్తు ప్రయత్నంబున. ౨౯

క. శర్వాణీ వాణీ ముఖ
గీర్వాణీకోటి జానకీరఘుకులరా
ట్పూర్వాచరిత వివాహో
త్సవ సుగీతములు పాడఁగా విభవమునన్. ౩౦

తే. నెమ్మి నేకావళియు స్రగ్విణియును జామ
రంబు లిరుగెడ నిడ హరిద్రాద్రవమునఁ
బెట్టిరి నలుంగు లక్కన్యఁ బెండ్లికూఁతుఁ
జేయ ఋషిపత్ను లర్థి నాశీర్యుతముగ. ౩౧

తే. అట్లు వైవాహికపుదీక్షయమరఁ గమ్మ
నూనెఁ దలయంటి నెఱులు గందానఁ బులుమ
స్వర్ణమణికుంభహిమవారి జలక మాడి
నట్టి జగదీశ్వరికి వేల్పుటబలయోర్తు. ౬౩

క. తడియొత్తి సన్నవలిపం
బిడి మణిపీఠస్థయైన యింతి మెఱుఁగు పె
న్నిడుదకురు లార్చి ధూపం
బిడి తుఱుము ఘటించె నొక్క మృగేక్షణ నెమ్మిన్.

సీ. యావకద్రవమున నరుణాంఘ్రి నఖపంక్తు
లభ్యక్తములు సేసె నతివయోర్తు.
నయ కల వ్రేళ్ళమట్టియలుఁ బిల్లాండ్లిడి
పాయవట్టముఁ బెట్టెఁ బైఁ నొకర్తు.
నెఱికెవట్టి పసిండి నీటివ్రాఁత చెఱంగు
వెలిపట్టు రిహిఁ గట్టె వెలఁదియోర్తు
కటిసీమఁ గనకమేఖలఁ జేర్చి తాంపో
రమ్ములు గీలించెఁ గంఠమున నోర్తు.

తే. కటకములు హస్తసరము లంగదము లంగు
శీయకములును బాహుపల్లికల వ్రేళ్ళ
సిరిపితాటంకనాసామణుల సమర్చి
చౌనిపై సీమంతవీథిఁ జేర్చె కర్త యోర్తు ౬౪

క. కలికి తెలిగన్నుఁగవఁ గ
జ్జలరేఖలు దీర్చి మేన సారంగమదం
బలఁది లలామక మిడి చెం
గలువలు క్రొవ్విరులు వేఱొకర్తు ఘటించెన్. ౬౫

వ. ఇట్లలంకృతయై యుండ లగ్నం బాసన్నంబయ్యె ననివిన్నవించుటయుఁ బన్నగ
శయనుండు మార్తాండ మండలంబులు వంద్రెండును దివియలై వెలుంగఁ,
దారకల గుంపు జగజంపుగా శతపత్రిశ్రుం దాతపత్రిత యంగీకరింప,
సింధుపత్రి సౌగంధిక దళోపహార సహితంబుగా విపణిఁ గలయం జిలికింపఁ,

ప్రకృతికాంత క్రంత సురకాంతలం గూడుకొని నంతరింప, హుతవహుం దగరుధూపంబు రేపఁ, బర్జన్యుం డుల్లెడయిడఁ, బ్రాచీన పాఠంబులు పాఠకౌఘంబులయి బిరుదప్రబంధంబులు పఠియింప, విధినందన సనందనాదులు సంగీత మాంగల్యంబున నంతరంగంబున కింపొసంగ, విహంగపుంగవుండు మత్తమాతంగంబై ఖచితమణికల్యాణం బగు పల్యాణం బంగీకరింప, నప్రాకృత వైభవంబునం జని, పరమసంభ్రమంబున భాగవతవతంసంబు భక్తికలిత బహుప్రణామపూర్వకంబుగా నెదుర్కొన నెక్కిరింత దిగ్గి విష్వక్సేను కరం బవలంబించి కక్ష్యాంతరంబులం జంచలాక్షులు గడుగు నడుగుల జలంబులకుం బయిపయిం బడి గీర్వాణ సిద్ధ సంఘంబు లహంపూర్వి సుర్వినివార్యరిగా నూర్చికొని ప్రాకింపఁ బ్రవేశించి తదీయ నిర్దిష్టం బగు జాంబూనద పీఠంబున నుపవిష్టుండై యతండు వెండియు బంగారుభృంగారుకంబులఁ గనక భాజననిక్షిప్తంబు లగు కుశేశయ పేశల పదకిసలయంబులు గడిగి షోడశోపచార సహితంబును సపరిష్క్రియంబు నగు మధుపర్కంబు నొసంగం గొని యయ్యాళ్వారు దేవేరియుం దానును ధారవోయ నా కన్యకారత్నంబుఁ బరిగ్రహించె ననంతరంబ. ౬౬

మ. కలధౌతద్రవ చిత్రము ల్మెఱయ ముక్తాన్యూత మౌ మేచకాం
చలపుం బెండెఱ వారి లగ్నము సమాసన్నంబుగా వేల్పుఁబె
ద్దలు పంపన్ గుడ జీరకంబులు సముద్యత్ప్రేమ నన్యోన్య మం
జుల మస్తంబుల నుంచి రర్థిఁ గనుమించు ల్చిత్తము ల్దాఁగఁగన్. ౬౭

చ. మఱి వనమాలి చూడమున మానిని ముత్తెపుఁబ్రాలు వోయుచో
మెఱయుఁ దదంగుళీకినల మేళనఁ జక్కి చెమర్చ రాలి మై
నఱిమఱి ఘర్మబిందువులు నమ్మణులు న్మొగిలందునుండి డా
ల్గిఱిగొన జాలు ధారల బలె న్వడగండ్లబలె న్గనుంగొనన్. ౬౮

తే. ఇంతి దోయిట సేసఁబ్రా లెత్తుచోట
గుబ్బపాలిండ్లకేవ గ్రక్కున మురారి
గన్ను వేయుటఁ గని లజ్జ గదుర బాహు
లెత్తక కరాగ్రములన పై కెగరఁజల్లె. ౬౯

క. గళమునఁ గట్టెను హరి మం
గళ సూత్రము పులక లతివ గాత్రముఁ బొదువన్
నెలఁతయుఁ బతియును గరముల
నలవఱిచిరి కంకణంబు లన్యోన్యంబున్. ౭౦

ప్రకృతికాంత క్రంత సురకాంతలం గూడుకొని సంతరింప, హుతవహుం డగరుధూపంబు రేపఁ, బర్జన్యుం డుల్లెడయిడఁ, బ్రాచీన పాఠంబులు పాఠకౌఘంబులయి బిరుదప్రబంధంబులు పఠియింప, విధినందన సనందనాదులు సంగీత మాంగల్యంబున నంతరంగంబున కింపొసంగ, విహంగపుంగవుండు మత్తమాతంగంబై ఖచితమణికల్యాణం బగు పల్యాణం బంగీకరింప, నప్రాకృత వైభవంబునం జని, పరమసంభ్రమంబున భాగవతవతంసంబు భక్తికలిత బహుప్రణామపూర్వకంబుగా నెదుర్కొన్న నెక్కిరింత డిగ్గి విష్వక్సేను కరం బవలంబించి కక్ష్యాంతరంబులం జంచలాక్షులు గడుగు నడుగుల జలంబులకుం బయివయిం బడి గీర్వాణ సిద్ధ సంఘంబు లహంపూర్వి సుర్వి నిత్వారిగా నూర్చికొని ప్రాశింపఁ బ్రవేశించి తదీయ నిర్దిష్టం బగు జాంబూనద పీఠంబున నుపవిష్టుండై యతండు వెండియు బంగారుభృంగారుకంబులఁ గనక భాజననిక్షిప్తంబు లగు కుశేశయ పేశల పదకిసలయంబులు గడిగి షోడశోప చార సహితంబును సపరిష్క్రియంబు నగు మధుపర్కంబు నొసంగం గొని యయ్యాళ్వారు దేవేరియుం దానును ధారవోయ నా కన్యకారత్నంబుఁ బరిగ్రహించె ననంతరంబ. ౭౬

మ. కలధౌతద్రవ చిత్రముల్ మెఱయ ముక్తాస్యూత మౌ మేచకాం
చలముం బెండెలి వారి లగ్నము సమాసన్నంబుగా వేల్పుఁబె
ద్దలు పంపన్ గుడ జీరకంబులు సముద్యత్ప్రేమ నన్యోన్య మం
జుల మస్తంబుల నుంచి రర్థిఁ గనుమించు ల్చిట్టుము ట్టాడఁగన్. ౭౭

చ. మఱి వనమాలి చూడమున మానిని ముత్తెపుఁబ్రాలు వోయుచో
మెఱయుఁ దదంగుళీకిసల మేళనఁ జక్రి చెమర్ప రాలి మై
నఱిమఱి ఘర్మబిందువులు నమ్మణులు న్మొగిలందునుండి డా
ల్గిఱిగొన ఱాలు ధారల బలె న్వడగండ్లబలె న్గనుంగొనన్. ౭౮

తే. ఇంతి దోయిట నేసఁబ్రా లెత్తుచోట
గుబ్బపాలిండ్లక్రేవ గ్రక్కున మురారి
గన్ను వేయుటఁ గని లజ్జ గదుర బాహు
లెత్తక కరాగ్రములన పైకెగరఁజల్లె. ౭౯

క. గళమునఁ గట్టెను హరి ఘం
గళ సూత్రము పులక లతివ గాత్రముఁ బొదువన్
నెలఁతయుఁ బతియును గరముల
నలవఱిచిరి కంకణంబు లన్యోన్యంబున్. ౮౦

సీ. లలనచే నిష్ఠతో లాజలు వేల్పించి,
    శార్ఙ్గి మెట్టించెను సప్తపదులు,
తెలుపఁ గూడి యరుంధతీ దర్శనముఁ జేసె,
    బ్రహ్మరుద్రాది గీర్వాణికోటి
యర్చింపు నుడుగుర లనుకంపఁ గైకొని
    యనిచెఁ బ్రసాదభాజనులఁ జేసి,
యాత్మపట్టణమున కతివఁ దోడ్కొని విజ
    యంబు సేసెను మహాహర్ష మెప్ప,

తే. సహ్యకన్యాతటోద్యాన చందనద్రు
    కుంజముల నీలకుంతలఁ గుస్తరించి
కంతుసామ్రాజ్యమేలించి కరుణఁ జిత్త
    మొలయ జగములఁ బాలించుచున్నవాఁడు. ౨౧

ఉ. స్కందసరస్తటీరమణ కందర చందన కుందవాటికా
మందసమీరలోల వనమాలిక, నిర్మలదివ్యవిగ్రహా
స్పందవిఖాధరీకృత నభస్స్ఫుట కాళిక, వల్లవాంగనా
బృందమనోభిమాన ధృతి భేదన, పేశలవంశవాదనా. ౨౨

క. అరిధారాఖండిత మధు దరిసంఘ, విహంగవాహనా, యుదరమహాం
బురుహ పుటభరిత మధుశం బర భర జలమానుషాయమాణద్రుహిణా. ౨౩

స్రగ్విణి. వాలినిర్భేదనా వారిజాతేక్షణా
    శైలకన్యాస్తుతా శార్ఙ్గచంచద్భుజా
    పాలదృక్పద్మభూపాక భేదిస్ఫుర
    న్మౌళిమాణిక్యరు క్మండితాంఘ్రిద్వయా.

మ. ఇది నీలాచలనీలవేలక సుభద్రేందీవరాభాక్షి కో
ఐదృగంచద్భుజవీర్యధుర్య జయసన్నాహార్భటీవావ్యభీ
త్యుదితేభేశ్వర కృష్ణరాయమహిజాన్యత్పాదితాముక్తమా
ల్యద నాశ్వాసము సప్తమం బలరుహృద్యంబైన పద్యంబులన్ ౨౪

సంపూర్ణము

శ్రీ కృష్ణార్పణమస్తు

ఓం తత్ సత్

# కొన్ని శబ్దములకు

## ప్రకరణోచితార్థములు

## (GLOSSARY)

### అ

అంకకాఁడు = చలపాది

అంకెవన్నె = రౌతు కాలుంచి యెక్కుటకు గుఱ్ఱమునకు పార్శ్వమున వ్రేలఁగట్టెడి యినుపవలయముతోడి వారు.

అంచపదము = వ్రాఁతలో నడుమ అక్షరనష్టి సూచక చిహ్నము.

అంజనము = 1. ఆపేరి యేనుఁగు.
2. మాలిన్యము.
3. కఁడెన.

అంట = గుంపు

అంతిక = ప్రొయ్యి

అందంబుగూడుకొను = వానితో తాను చేరు

అందు = అందుచున్న; అనుచున్న

అంధుయంత్రము = ఏతాము

అగప = అజక

అగపడు = అగ్గము (= స్వాధీనముపడు)

అజస్రము = సర్వదా

అడవెట్టు = మొఱయిడు

అడుపఁగా = మొత్తఁగా

అతంత్రము = వికలము, భగ్నము

అతర్క్యము = ఊహింపమి, అరయమి

అదటు = గర్వము

అదవకాఁపు = అస్థిరపుఁగాఁపు

అనరు = ఇబ్బంది

అనిష్టుఁడు = వైరి

అనుగళత్ = మాటిమాటికి పడుచున్న

అనువు = సుంకము

అభిఘారము = పైని (నూనె, నేయి) పోఁత

అరి = ధనరూపమైన పన్ను

అలతియొడివి = గొంతుగండి

అలము = ఆక్రమించు

అవిద్య = 1. అగ్నిహోత్రాది కర్మ
2. అజ్ఞానము

అహంమానము = అహంకారము

అహి = 1. పాము 2. తనవాఁడు

అగ్గలిక = ఉత్సాహము

అగ్గెడ = అక్కృత

అగ్నిశిఖ = కుంకుమపువ్వు

అద్ధా వాక్ = 'సరి' అనుమాట

అలుకు = భయము

అశ్మసారము = ఇనుము.

### ఆ

ఆఁక = నిరోధము

ఆకర్షకము = సూదంటురాయి

ఆతతాయి = (తన్ను) చంపవచ్చిన వాఁడు

ఆపాగా = తబేలా (= గుఱ్ఱముల నుంచు చోటు)

ఆమని = నుఱిపిడి (వసంతఋతువు)

ఆయతికాఁడు = ధనమార్జింప వలసిన వాఁడు
ఆరు = తృప్తిపడు
ఆలాపిని = తంబురా
ఆవులు = ఆవిరులు
ఆద్యము = శ్రేష్ఠమైనది
ఆర్చు = ఆడించు = పలికించు
ఆర్తి = ఇబ్బంది

## ఇ

ఇంగాలము = బొగ్గు
ఇడియు = చిదుగు, కూలు
ఇడువు = ద్వారపార్శ్వము
ఇతరేతర = ఒండొరులతో
ఇనుఁడు = 1. సూర్యుఁడు 2. రాజు
ఇరమ్మదము = మేఘములోని జ్యోతి
ఇచ్చకులు = ఇచ్చకముగా నడుచువారు.

## ఈ

ఈఁఅము = పొద
ఈలకఅచు = ప్రాణము బిగబట్టు
ఈలువు = మానము
ఈషి = చూచు (= తలఁచు) వాఁడు

## ఉ

ఉదన్తు = వని నుండి తొలఁగింపఁబడిన వాఁడు
ఉదార = పెద్ద
ఉదుటు = ఉద్ధతి
ఉపాంశున = రహస్యముగా
ఉబుసుపోక = వినోదకాలక్షేపము
ఉరవు = ఉచితము
ఉలుకు = జంకు
ఉలుచ = చిన్నచేప
ఉలుపాలు = కానుకలు
ఉచ్ఛ్వాసము = కలుజు
ఉత్పాతము = లోకస్వభావమునకు విపరీతమైనది
ఉత్సేకము = గర్వము
ఉద్గారము = త్రేన్పు
ఉమ్మనీరు = ఉబ్బనీరు, ప్రసవజలము
ఉల్లసము = వరిహాసము
ఉల్లెడ = మేలుకట్టు.

## ఊ

ఊఁదు = ఊను
ఊర్జస్వలుఁడు = మిక్కిలి తేజోవంతుఁడు

## ఋ

ఋతువేళ = ఋతుస్నానవేళ

## ఎ

ఎడకాఁడు = కుంటెనకాఁడు, తార్పు కాఁడు
ఎడవు = దూరము
ఎరవు = సొంతముకాని, లాఁతితనము, తాత్కాలిక జీవనము
ఎఱ = మేఁత
ఎలగోలు = మొదట కురిసినది, వాన
ఎత్తు = దంత
ఎవ్వ = ఏవ, లేమి

## ఏ

ఏకాంగి = ఆలుబిడ్డల వదలి, కావి వస్త్రములుదాల్చి భగవ[illegible]ంకర్యము చేయు విరక్తుఁడు
ఏతరి = నీతిమాలినవాఁడు
ఏవిరి = హద్దు
ఏరుసాగు = దున్ను

## ఐ

ఐకకంఠ్యము = ఏకాభిప్రాయత్వము

## ఒ

ఒండె = ఒక్కటె

ఒదర్చు = ఊఁడలాగు

ఒదుగుగా = సమృద్ధిగా

ఒరుము = చుఱుకెక్కు

ఒరుదలకాఁడు = కొండెగాఁడు

ఒఱయిడు = ఆలోచనచేయు

ఒట్టు = అంటు

ఒడ్డు = నిడుపు

ఒల్లఁబోవు = మూర్ఛిల్లు

## ఓ

ఓటము = పరాజయము

ఓహరిసాహరి = తండోపతండము, నేను ముందు నేను ముందు అని.

## ఔ

ఔరు = పెల్లగిల్లరాని గంట

## క

కంకణము = 1. గాజు
2. కంకణాయి పక్షి.

కంకము = గద్ద

కంటకిత = 1. గగుర్పొన్న
2. ముండ్లుగల

కందనకాయ = గుండెకాయ

కందు = నొచ్చు

కుందము = 1. సరస్సు
2. కుంద

కక్కసము = బలవంతము

కటకాముఖము = బాణముపట్టుకొనను తగు పిడికిలి

కట్టావి = 1. పొగ, 2. మిక్కిలివేడి

కడ = చావు

కడార = పసుపుపచ్చ

కడార కాచకటకము = పచ్చని లక్కగాజు

కనరు = ఒగరు

కనుగలుగు = చక్కఁగ పరికించు

కన్కసరు = అసూయ

కన్దళుకు = నేత్రధాళధళ్యము

కన్ను = 1. మృదంగవాద్యముఖపు బిళ్ల
2. జాత

కపోణి = మోచేయి

కమన = కామించువాఁడా

కరక = వడగల్లు

కరభము = మనికట్టు మొదలు చిటికెన వ్రేలివఱకు గల చేతి బయటి భాగము

కరవటము = బరణి

కరి = సాక్షి

కరుళ్లు = గడ్డలు

కర్కటిక = దోస

కఱ (ఱ్ఱి, ఱు) కట్లు = ఇనుపసలాక యందు గ్రుచ్చి కాల్చెడు మాంస ఖండము, శూల్యము

కల్పు = కరంచు

కవురుమాసిని = కపటముగలవాఁడు

కసీసము = మైలుతుత్తపు నలువు

కాంబవ = కంబు (= శంఖము)యొక్క

కాడుపడి = దారితప్పి, విభ్రమచెంది

కానణ = వెలుంగునట్లు

కార = చెఱసాల

కారుకుఁడు = శిల్పి

కావులు = కావివస్త్రములు

కిటకిటన = కృశము

కిట్టు = తగులు

కిరి = వరాహము

కీకటులు = మ్లేచ్ఛులు
కీకసము = పచ్చియెముక
కీలుమదము = కీలు (వన్నె–నలుపైన) మదము
కీల్కొనఁ = నాటునట్లు
కుండము = కొలను, కుండ
కుట్టుసురు = కొఱప్రాణము
కుప్పసము = అవిక
కుబుసము = చొక్కా
కుఱు = చిన్న
కూపెట్టు = మొఱయిడు
కెలసము = పని, హేతువు.
కెళవు = ప్రక్క, పార్శ్వము
కేదారము = శిరస్త్రము (helmet)
కేరతము = పరిహాసము
కైజా = కళ్ళెము
కైశికము = టక్కు
కొట్టికాఁడు = వేగులవాఁడు
కొఱమె = నింద
కొదవెట్టు = లోపము కల్పించు
కొప్పెర = కటాహము
కోటియిడు = వేగు ఉంచు
కోరు = ధాన్యరూపమైన పన్ను
కోలము = వేషము
క్రంత = పెండ్లికొడుకువారు పెండ్లికూఁతునకు తీసికొనిపోవు ప్రధాన ద్రవ్యసముదాయము
క్రందుగా = దొమ్మిగా
క్రాయు = ఉమియు, క్రక్కు

## ఖ

ఖంజన = కాటుక పిట్ట
ఖని = గని
ఖనిత్రము = గడ్డపాఱ
ఖటూరిక = గరిడీ

## గ

గంట = పైరుదుంప
గంటు = ముడి
గండె = మత్స్యము
గంధర్వము = గుఱ్ఱము
గచ్చు = పూఁత
గడి = ఎల్ల
గనెలు = ఖండములు
గరిగ = చిన్నపాత్ర
గరుసు = పచ్చితోలు
గల్లము = చెక్కిలి
గామిడి = శ్రేష్ఠము
గిరిక = చిట్టెలుక
గిఱవు = కుదువ
గుట్టుకీడు = గూఢశత్రువు
గుఱి = గుఱుతు
గూడ = బుట్ట
గొంతుక్రోల్ = కంఠనాళము
గోపిక = కావలియాడుది
గోము = సౌకుమార్యము
గోలగగ్గెర = కాళ్లుచేతులు పసరమువలె చేర్చి కట్టుట
గౌదకట్టు = చెంపలను మూసి కట్టినగుడ్డ

## ఘ

ఘరట్టము = తిరుగలిపై రాయి
ఘుణ = ప్రమానుతొలుచు పురుగు

## చ

చండాతకము = చల్లాడము
చంద్రము = సిందూరము
చక్కఁజేయు = ముగించు, చంపు.
చదుము = చదును ప్రదేశము
చమురు = చన్నునలువు

చలి = 1. సీతు 2. జంకు
చల్లువెన = పిడికిళ్లతో చల్లకము
చవి = 1. స్వాదిమ, 2. ముత్తెము బరువు
చాఁగు = ఏఁగు
చాఁపట్టు = పలుచని యట్టు
చిట్టరము = కపటము
చెండాడు = చెండు, కొఱుకు
చెదదు = విడదు
చెఱకతము = బెల్లము
చెల్కు = బీడినేల
చేమమడి = చేమకాడల పొలము
చొచ్చు = ప్రవేశించు
చౌతు = కళ్లాయి
చౌదంతి = నాలుగు కొమ్ముల యేనుఁగు
చౌరుకొట్టు = వాసనకొట్టునట్లు సమలు

## ఛ

ఛత్రాకము = పుట్టగొడుగు

## జ

జంభలము = నిమ్మ
జక్కులబోనము = మిథ్యాభోజనము
జజ్జుకొను = జజ్జువడు
జడను = ఆలస్యము, జాడ్యము.
జల్లులు = జాలరులు
జాంగలము = మెట్టచేను
జానుదఘ్న = మోకాలిబంటి
జాలి = ఖేదము, వెత
జిలుగుపని = స్వల్పకార్యము
జీలుఁగు = ఒక చెట్టు పేరు
జూటుఁదనము = మోసము
జెన = గ్రద్దసమూహము
జోదన = జంట
జౌతుమడి = బురదకయ్య
జ్ఞప్తి = నిద్రనుండి మేల్కొలుప

## ట

టంకసాలవాటులు = నాణెములు
టెక్కు = టోపి.

## డ

డంబు = వేషము
డింగరీఁడు = భక్తుఁడు
డాత్కూటము = చేఁదు చేఁప
డోఁగు = డోఁగు = మోకాళ్లపైన నడుచు

## త

తక్కుము = విడుము
తగడు = రేకు
తగులము = అడ్డు
తడ = విరోధము
తడుకు = వెలుగు
తతము = వీణె
తదూర్ధ్వచ్ఛాయ = పైకి వ్యాపించు అతని కాంతి
తని = సన్నని
తనుపారు = చల్లనైన
తపారము = టోపి
తరవాయి = ఉపక్రమించి జరుపుచున్నట్టిది
తరకసము = అమ్ములపొది
తఱియు = చొచ్చు
తల = మీఁద
తలరి = ఊంకించి
తాఁకిన = చెక్కిన
తావలు = మెట్లు
తిమ్మనము = మజ్జిగ పులుసు
తియ్యము = ప్రియము
తివిఁయించు = యుద్దోపిడిచేయించు
తునికిలు = జాళ్లు

తూగింపు = నెఱవేర్పు
తుంపరాణి = తూను
తెరవేఁట = తెరలతో ఆవరించిన చోటి వేఁట
తేఁట = 1. నీటితేఁట
2. మత్తెప్పగాంతి
తేరకత్తె = పనిలేనిది, అక్కఱలేనిది
తొగరు = ఎఱుపురంగు
తొడిబడి = తొట్రుపడి
తొలఁకు = అల
తోమాలె = ఆకులు పువ్వులు చేర్చి కట్టిన మాలె
తోయి = మేఘము
త్రస్తరి = క్రింద ; పరిహాసము
త్రోపాడు = కైకొను

## ద

దంచనము — పెద్ద ఫిరంగి
దండ = భుజము
దండెత్తు = విజయార్థము సేనతో తరలు
దంశితము = మఱుపు దాల్చినది
దడములు = దట్టములు
దళ = కోఁత
దాత్ర = కొడవలియైనవాఁడా
దావవట్టు = దానముగొను
దీము = ఆకర్షకము
దును = దున్ను
దూపించు = దప్పిచే పీకనొందు
దొ = దవ్వు
ద్రుహిణజ = నారద
ద్వయము = రెండువాక్యములు (వైష్ణవుల యొక్క నారాయణ రహస్యము)
ద్వైతము = జీవేశ్వర భేదము

## ధ

ధర్మము = లక్షణము

## న

నంబి = పూజారి (విష్ణు పూజకుఁడు)
నప్త = మనుమఁడు
నయము = సులువు
నల్లదాసరిగాఁడు = తాబేలు
నాకు = అనకు
నాగరము = సొంటి
నాగవాసము = వేశ్యలమేళము
నాటి = పాదుకొని
నిగ్రహస్థాన = పరాజయహేతువు
నిట్టు = శుష్కోపవాసము
నిమితికాఁడు = బోయవాఁడు
నిర్వాణము = మోక్షము
నిశారజస్సు = పసుపుపొడి
నీరాజనము = నివాళి
నీర్వట్టు = దప్పి
నెత్తము = 1. జూదము
2. ఉమ్మడిబీడు
నెరవు = అగ్గము
నెరసెఁ = వ్యాపించెను
నెఱి = 1. విధము 2. ఆచారము
నెఱిక = కుచ్చెళ్లు
నెఱికురులు = కుటిలకుంతలములు
నెఱియలు = బీలికలు
నెఱుఁగు = ఒరుఁగు

## ప

పంజరంబు = బురఖా, గవుసెన
పండించు = వంచించు
పట్టము = తిరువపరివట్టము
పదరులు = గద్దింపులు

మధూళిక = మధువు
మరుత్తృణము = ఇంద్రధనసువు
మర్కటము = సాలెపురుగు
మలుచుట్లు = తిరుగుడు మలులు
మహౌషధి = సొంటి
మానిని = శూరుడు
మాఱుమలయు = ఎదిరించు, సాటికివచ్చు
మానరము = అతిశయము
మిథము = పరస్పరము
మిహిక = మంచు
ముంజి = మొలత్రాడు
ముఱు = దుర్గంధము
ముల్లుచూపు = హెచ్చగు
మూరిండోవు = అతిశయించు, విజృంభించు
మూలమంత్రము = (నారాయణ) అష్టాక్షరి
మృత్యువు = (మనుష్య) సామాన్య ప్రమాదము.
మైపడి = సమ్మతి
మొఱగు = దాచు
మొగిల్పిరి = మబ్బువిడిచిన
మోటనము = నుగ్గుచేయుట
మోరు = శిఖరము
మోహము = అవిద్య
మ్రాన్పడు = ఏమియు తోచకుండు

## య

యమి = (పరమ) హంస, ముని
యవసము = గడ్డి
యవసరాశి = గడ్డిమేటి, వామి
యామ్య = యమసంబంధమైన
యోగము = 1. చింతించుటలో నేర్పు
ధ్యానించుటలో నేర్పు
2. చిత్తనిరోధము,

## ర

రంతు = శబ్దము, రచ్చ
రసము = రుచి
రాంకవము = బూర్నీసు
రాహూయమాణ = రాహువువలె (పాము వలె) నగుచున్న
రెంట = విరోధము
రెంటంపు = రెట్టనేతవస్త్రము
రెంటము = గోచి
రెయి = రేయి
రైవేశ్మ = ధనాగారము
రోహితము = కొరకు, ధనుస్సు
ఱిచ్చ = దిగులు
ఱొచ్చు = ఒరుల సంపర్కము

## ల

లక్ష్మణ = పెంటిబెగ్గురు
లఘువు = గంతు
లడ్డిగ = సన్నమూతిపాత్ర
లది = అనురక్తి.
లస్తకము = వింటిపిడికట్టు
లాంపట్యము = లోలుపత్వము
లాచు = కాంక్షించు
లాతు = అధికము
లావరా = జలదారిమూయు పలక
లావణ్యము = ఉప్పందనము
లోగు = వెనుదివియు
లోహండి = వంటబిందె

## వ

వంగఃళ్ళు = నీటిబొట్లు
వడిబెట్టు = శుద్ధముచేయు
వయస్సు = ఆయుస్సు
వరుగు = గద్ద
వర్షాభులు = కప్పలు

సేతువు = ఆనకట్ట
స్వామ్యు = ఆభరణములు
సో(కు = ప్రయాస
సోణాల్ = ముక్కెముకలు
స్థానికులు = దేవస్థానాధికారులు
స్రవంతి = 1. ఏఱు 2. ఇసుక గడియారము.

## హ

హట్టము = అంగడి
హఠము = బలాత్కారము
హరి = కోపము
హసంతిక = కుంపటి
హావడి = ఉపద్రవము
హేవాకము = ఇచ్ఛ

# శోధనము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ఉపోద్ఘాతము | | | |
| 2 | 3 | ఆఱి | ఆరి |
| 9 | 26 | డితో | డితితో |
| 15 | 25 | జ్గస్యకి | జ్గస్యచకి |
| 20 | 23 | సూల | స్థూల |
| 21 | 1 | వత్ప్రి | జిత్ప్రి |
| 25 | 2 | దజ్గి | దజ్గ |
| 26 | 2 | క్లేష | శ్లేష |
| 29 | 8 | రగి | రవి |
| 33 | 9 | చాఱ | చార |
| 35 | 5 | నాపి | నాస్తి |
| 37 | 19 | పితి | స్థితి |
| „ | 20 | వాదము | వాదమ్ముఖ |
| 38 | 25 | రక్షి | రక్ష |
| | | పుట్టి | పుట్టి |
| 39 | 19 | బరి | పరి |
| 40 | 30 | పెంచు | పెంచుకొం |
| ఆముక్తమాల్యద | | | |
| 10 | 2 | వీఁటి ఫీఁటి | పీటి పీఠి |
| 12 | 18 | సగ | నగ |
| 22 | 4 | సూష్మ | సూక్ష్మ |
| | 22 | మలు | మల్లు |
| | 28 | ద్లురు | ద్గురు |
| 24 | 24 | వేల | వేళ |
| 26 | 12 | ర్చున్ | ర్చుచున్ |
| 29 | 13 | వాఁటి | వాటి |
| 34 | 28 | బోఁబు | దోఁబ్బు |
| 35 | 1 | స్వస | స్వన |
| 37 | 22 | జజ్ఞా | జజ్ఞా |
| 38 | 12 | నాగ | నాక |
| 48 | 15 | న్నన్ | వన్నన్ |

# శోధనము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 59 | 14 | పరమ | పర |
| 63 | 9 | నాలె | జ్ఞాలె |
| 66 | 22 | రంబం | రుంబం |
| 71 | 13 | తన్ని | యన్ని |
| 81 | 2 | నేపె | పేపె |
| 90 | 4 | పీనఁబు | పీనంబు |
| 91 | 9 | దూఁగి | దూఁది |
| | 11 | పిత | పిత |
| 110 | 2 | ల్గడు | గడు |
| 112 | 17 | కాల్య | కల్య |
| 121 | 5 | బ్రాకెఁడు | బ్రాఁకెడు |
| | 25 | దోక | దోఁక |
| 135 | 8 | మెలిచె | మొలచె |
| 140 | 27 | పీవియు | పీవియు |
| | 28 | టగు | ట్లగు |
| 148 | 24 | వమచు | పనుచు |
| 149 | 4 | రతి | రత |
| 150 | 20 | గల్గెర | గగ్గెర |
| 151 | 14 | యాయట్ల | మాయట్ల |
| 163 | 15 | నెర | నెడు |
| | 22 | బుఁగొండు | బు గొండు |
| 165 | 19 | గుదియు | గుదియ |
| 170 | 1 | నెపంబుప | నెపంబున |
| | 14 | యసుబు | యుసుబు |
| 176 | 19 | తాంట | తాటం |
| 177 | 5 | రింవ | రింప |
| | 6 | క్మేను | క్పేను |
| 178 | 21 | కృదృ | కృద్మ |